శ్రీమతే రామానుజాయ నమః



పొయ్‌కై యాళ్వార్ అనుగ్రహించిన

# ముదల్ తిరువన్దాది

## - సవ్యాఖ్యానము

**(ప్రథమభాగము)**

**ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వేంకటాచార్యస్వామివారి**

**తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక - 2015**

పొయ్‌కై యాళ్వార్ అనుగ్రహించిన

# ముదల్ తిరువన్దాది- సవ్యాఖ్యానము

( ప్రథమభాగము )

( నమ్బిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై, అప్పిళ్ళై, ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి దివ్యార్థదీపిక వ్యాఖ్యానాలతో, అరుంబదమ్‌తో, పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి, దివ్యార్థదీపికకు ఆంధ్రానువాదంతో )


ప్రథమ ముద్రణ : జూలై, 2015

ప్రతులు : 1000

సందర్భము : ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవము - 2015

ఆవిష్కరణము : 29-7-2015

ముద్రణము : సి.ఎన్. ప్రింటర్స్
తిరుపతి




# ప్రవేశిక

**వరుత్తుమ్ పుఱవిరుళ్ మాఱ్ఱ వెమ్‌పొయ్‌కైప్పిరాన్ మఱైయిన్**
**కురుత్తిన్ పొరుళైయుమ్ శెన్దమిళ్‌తన్నైయుమ్ కూట్టి - ఒన్ఱ**
**త్తిరిత్తు అన్ఱెరిత్త తిరువిళక్కై త్తన్ తిరువుళ్ళత్తే**
**ఇరుత్తుమ్ పరమన్ ఇరామానుశన్ ఎమ్ ఇఱైయవనే**

(జీవులను బాధించే బాహ్యాంధకారాన్ని పోగొట్టడంకోసం ఉపకారకులైన మన సరోయోగి వేదాంతార్థాలను గొప్ప ద్రావిడ భాషతో చేర్చి, చక్కగా కూర్చి, తిరుక్కోవలూర్‌లో ముగ్గురు దివ్యసూరులు కలిసిన సమయంలో వెలిగించిన దీపాన్ని తమ హృదయంలో స్థిరంగా నిలుపుకొన్న మహనీయులైన శ్రీరామానుజులే మన నాథులు). (ఇరామానుశనూఱ్ఱన్దాది-8).

## 1. తమిళసాహిత్యం :

భారతీయభాషలలో సంస్కృతభాష తర్వాత, ఆ భాషతో ఇంచుమించు సమస్కంధంగా తమిళభాష వర్ధిల్లింది. అంతేకాదు, మిగిలిన దక్షిణభారతీయ భాషలలో విశేషంగా తన ప్రత్యేకతను నిలుపుకొన్నది ఈ భాష. సంస్కృతభాషా ప్రభావం తమిళంతోపాటు భారతీయ భాషలన్నిటిపైన ఉన్నా, మిగిలిన భాషలతో పోలిస్తే తమిళభాషపై గల సంస్కృతప్రభావం చాలా తక్కువ అనే చెప్పాలి. భాషావిషయంలోనే కాక, సాహిత్యం విషయంలోకూడా తమిళం తన ప్రత్యేకతను ప్రదర్శించింది. ఆ విధంగా తమిళసాహిత్య వైలక్షణ్యాన్ని నిరూపించే పలు అంశాలలో దివ్యసూరులనబడే ఆళ్వార్ల నాలాయిర దివ్యప్రబంధం అనే మధురభక్తి సాహిత్యం ఒకటి. వేదాలతో సమానంగా సంభావింపబడే ఈ సాహిత్యంలో ప్రధానప్రమేయం విష్ణుపారమ్యం.

## 2. ప్రాచీనద్రావిడవాఙ్మయంలో విష్ణుపరత్వం :

సాహిత్యకారుల, చరిత్రకారుల అభిప్రాయాన్నిబట్టి తమిళభాషాసాహిత్యం ఆవిర్భావం ఇప్పటికి సుమారు రెండువేల సంవత్సరాల ముందునాటిది. శ్రీవైష్ణవాచార్యుల అభిప్రాయానుసారం సంస్కృతవేదంవలెనే ద్రావిడవేదంకూడా అనాది. ఎవ్వుల కత్తైవ్వై వ్వైయుమ్ - ఎన్గైయాలే వేదమ్ బహువిధమ్, ఇదిల్ సంస్కృతమ్ - ద్రావిడమ్‌లు పిటివు ఋగాదిభేదమ్‌పోలే. **"శెన్దిఱత్తమిళ్" ఎన్గైయాలే ఆగస్త్యము మనాది"** అని అంటూ ఈ అంశాన్ని ఆచార్యహృదయకారులు నొక్కి వక్కాణించారు.

తమిళసాహిత్యం ఎంత ప్రాచీనమైనది అనే విషయంలో అభిప్రాయభేదం (సంప్రదాయజ్ఞుల-నవీనుల అభిప్రాయాలమధ్య) ఉన్నా, ఆ సాహిత్యం దక్షిణభారత సాహిత్యాలన్నిటిలో మొట్టమొదటిదని, అతిప్రాచీనమైనదనే విషయంలో ఐకకంఠ్యం కన్పిస్తుంది. ఆళ్వార్ల ప్రబంధాలకంటె ప్రాచీనం అయిన తమిళసాహిత్యంలో విష్ణుపరత్వం పలు చోట్ల సుస్పష్టంగా గోచరిస్తున్నది. పరిపాడల్ అనే గ్రంథంలో **"నిన్ ఏవలుళ్ పణిన్దమై కూఱుమ్ అఱుమఱైప్పొరుళ్"** (1-13), **"వాయ్మొழிప్పులవ"** (1-65), **"శాయల్ నినదు వాన్ నిఱై ఎన్నుమ్ అఱుమఱైప్పొరుళ్"** (2-59) (నీ వర్ణం ఆకాశవర్ణమని వేదం చెబుతున్నది) **"వేదత్తు మఱై నీ"** (3-66) (వేదంలో చెప్పబడ్డ ధర్మం నీవు) అని, **"వేదమ్ ముదల్వన్ ఎన్బ తికిరియోనై"** (సుదర్శనధారిని వేదం పరమపురుషుడని అంటున్నది) **(నఱ్ఱిణై)** ఇత్యాదిగా కన్పించే పలు ప్రమాణాలు ఇచట అనుసంధేయాలు. ఈ విష్ణుపరత్వమే ఆళ్వార్ల సాహిత్యంలో మఱింత సుస్పష్టంగా, దృఢంగా ప్రమాణంగా చెప్పబడింది.

## 3. ఆళ్వార్లు:- దివ్యప్రబంధాలు

ఆళ్వార్లు **"పొయ్కైయార్ పూదత్తార్ పేయార్ పుకழ் మழிశై ఐయనరుళ్ మాఱన్ శేరలర్కోన్ తూయబట్టనాదన్ అన్బర్తాళ్తూళి నఱ్పాణన్ నన్కలియన్"** అనే ఉపదేశరత్నమాలై సూక్తిప్రకారం పదిమంది. వీరితో ఆణ్డాళ్ (గోదాదేవి), మధురకవియాళ్వార్లను చేర్చి పంద్రెండుమందిగా చెప్పే సంప్రదాయమూ ఉన్నది. వీరు అనుగ్రహించిన ప్రబంధాల సంఖ్య 24. వీరు అనుగ్రహించిన ఈ ప్రబంధాలలోని పాశురాల సంఖ్య నాల్గువేలకు కొంచెం తక్కువగా ఉన్నా నాలాయిరమనే పేరు ఈ సాహిత్యానికి స్థిరపడింది. భగవద్రామానుజులకు సమకాలీనులైన తిరువరఙ్గత్తముదనార్ (శ్రీరంగామృతకవి) శ్రీరామానుజులను కీర్తిస్తూ అనుగ్రహించిన ఇరామానుశనూఱ్ఱన్దాది అనే ప్రబంధంకూడా శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం నాలాయిరదివ్యప్రబంధంలోనికి చేర్చబడి, అనుసంధింపబడుతున్నది. ఇది క్లుప్తంగా నాలాయిరదివ్యప్రబంధ వాఙ్మయ స్వరూపం.

## 4. ముదలాళ్వార్లు :

ఆళ్వార్లలో మొదటి నలుగురు-అంటే పొయ్కై యాళ్వార్లు, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు, తిరుమழிశైయాళ్వార్లు ద్వాపరయుగాంతంలో అవతరించగా, మిగిలినవారు కలియుగంలో ఆవిర్భవించారు. మొదటి ముగ్గురిని ముదలాళ్వార్లు అనే పేరుతో కూడా వ్యవహరిస్తారు. సరోయోగి అనబడే పొయ్కై యాళ్వార్లు, భూతయోగి అనబడే పూదత్తాళ్వార్లు, మహాయోగి అనబడే పేయాళ్వార్లు వరుస నక్షత్రాలలో - అంటే శ్రవణం - ధనిష్ఠ శతభిషఙ్నక్షత్రాలలో అవతరించారు. అందువల్ల జన్మత:-



పొయ్కై యాళ్వార్లు ముందువారు. అంతేకాదు. దివ్యప్రబంధా లన్నిటిలో వీరి ప్రబంధమే మొట్టమొదటిది. వీరు భగవానుని దివ్యాయుధాలలో ఒకటి అయిన పాంచజన్యంలో యొక్క అంశంతో ఆవిర్భవించారని సంప్రదాయజ్ఞుల కథనం. నమ్మాళ్వార్ల అవతారాన్ని గూర్చి నంబిళ్ళై తిరువాయ్మొழி ఈడు వ్యాఖ్యలో అనుగ్రహిస్తూ, అనాదిగా సంసారంలో పరిభ్రమించే ఒక చేతనుడు భగవానుని నిర్హేతుకకృపకు పాత్రమైనందున **"మయర్వఱ మదినల మరుళినన్"** అనే రీతిలో భ్రమ విప్రలంభాదిదోషరహితమైన విశుద్ధజ్ఞానాన్ని పొందిన నమ్మాళ్వార్లుగా అవతరించారని వచించడం ఈ యాళ్వార్ల విషయంలో అన్వయించుకోవడంలో లోటులేదు. ఆ విధంగా చెప్పడం భగవానుని నిర్హేతుక కృపావైభవాన్ని తెలిపేనట్లే అవుతుంది కదా! ఇక, ఈ ఆళ్వార్ల చరిత్రను గూర్చి, ఈ ప్రబంధం అవతరించిన వైనాన్నిగూర్చి ప్రబంధంలో 86వ పాశురంలో, ఈ ప్రబంధానికి గల వివిధవ్యాఖ్యల అవతారికలలో ప్రస్తావింపబడడంచేత 'పునరుక్తిభయంచేత, మళ్ళీ ఆ అంశాన్ని స్పృశించకుండా, ఈ ముదల్ తిరువన్దాదిలోని కొన్ని విశేషాలు మాత్రం సంగ్రహంగా ఇక నివేదించబడుతున్నాయి. రహస్యత్రయసామ్యం, వేదసామ్యం.

## 5. నాలాయిరంలో అన్దాదిప్రబంధాల ప్రాచుర్యం :

ముదలాళ్వార్లు అనుగ్రహించిన ప్రబంధాలు మూడూ అన్దాది ప్రబంధాలే. వారికి సమకాలీనులు, క్రమంలో నాల్గవవారు అయిన తిరుమழிశైయాళ్వార్లు అనుగ్రహించిన నాన్ముకన్ తిరువన్దాదికూడా అన్దాది ప్రబంధమే. వీరి నల్గురి తర్వాత అవతరించిన నమ్మాళ్వార్లు కృపజేసిన నాల్గు ప్రబంధాలలో మూడు - అంటే - **తిరువిరుత్తమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్మొழி** అనేవి అన్దాదిప్రబంధాలే. ఈ విధంగా ఆళ్వార్లలో మొదటి అయిదుగురు ఆళ్వార్లు అనుగ్రహించిన 9 ప్రబంధాలలో 7 ప్రబంధాలు అన్దాదులే కావడం గమనించతగ్గ విషయం. అవి కూడా మండల అందాదులే కావడం ఇంకొక విశేషం. అంతం, ఆది లేని భగవద్వైభవాన్ని వర్ణించడానికి అటువంటి స్వభావాన్నే కల అన్దాది ప్రక్రియను ఆళ్వార్లు స్వీకరించి ఉండవచ్చునని కొందఱు భావిస్తే, లేఖనసామగ్రి, లిపి సౌకర్యం లేని పూర్వకాలంలో పఠనపాఠనాదులన్నీ మౌఖికంగానే ఉండేవి కాబట్టి, మండల అన్దాది కంఠస్థం చేయడానికి అనుకూలమైనది కాబట్టి ఆ ప్రక్రియను ఆళ్వార్లు ఎన్నుకొని ఉండవచ్చునని మఱికొందరు సాహిత్య పరిశీలకులు తలచారు.

## 6. ప్రకృత ప్రబంధ - అష్టాక్షరీమంత్రార్థం :

ప్రస్తుతప్రబంధం అయిన ముదల్ తిరువన్దాది లోని ప్రధానప్రమేయం ఏది? అనే విషయం ముందుగా గమనించవలసి ఉన్నది. ఈ విషయాన్ని గూర్చి వ్యాఖ్యాతలు తమ వ్యాఖ్యలలో స్పష్టంగా తెలియజేశారు. ఈ ప్రబంధంలోని 57వ పాశురంలోని **"నయ నిన్ఱ నన్మాలై కొణ్డు నమో నారణా వెన్నుమ్ శొల్మాలైకఱ్ఱేన్"** అనే ప్రయోగాన్ని వివరిస్తూ అప్పిళ్ళై అనే పూర్వాచార్యులు తమ ఉరైలో **"తిరుమన్త్రార్థత్తై నయిప్పిక్కైయిలే**

**తత్పరమాయ్ క్కొణ్డునిన్ద విలక్షణసందర్భరూపమాన విప్రబంధత్తై క్కొణ్డెన్నవుమామ్"** అని అనుగ్రహించారు. దీనినిబట్టి ఈ ప్రబంధం అష్టాక్షరీమంత్రార్థ వివరణరూపమనే విషయం సుస్పష్టమవుతున్నది. మహావిద్వాన్ శ్రీకాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారుకూడా తమ దివ్యార్థదీపికలో ఈ అంశాన్ని ప్రస్తావించడాన్ని గమనించవచ్చు.

## 7. చరమశ్లోకార్థం :

ఈ ప్రబంధంలోని **"అడైన్ద వరువినైయోడు"** అనే 59వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై **"ఇతుక్కు క్కీழ్ప్పాట్టెల్లామ్ షట్కత్రయత్తిల్ శొన్న వార్‌త్తైపోలే స్వరూపమ్ విశదమాకైక్కు చ్చొన్న నిలై. ఇదు, చరమశ్లోకత్తిల్ నిలైపోలే"** అను అనుగ్రహించడంవల్ల ఈ ప్రబంధంలో ప్రధానార్థంగా భగవద్గీతాప్రమేయం అనుసంధింపబడిందని, 59వ పాశురం చరమశ్లోకార్థ ప్రతిపాదకమని తెలుస్తున్నది. నాలాయిరదివ్యప్రబంధం రహస్య త్రయార్థ ప్రతిపాదకమని మన పూర్వాచార్యుల హృదయం. అష్టాక్షరిలోని ప్రణవార్థాన్ని, నమశ్శబ్దార్థాన్ని, పల్లాణ్డునుండి కణ్ణినుణ్ శిఱుత్తాम्बువరకుగల ప్రబంధాలు–అంటే ముదలాయిరం ప్రతిపాదించగా, **"నారాయణాయ"** అనే భాగంయొక్క అర్థాన్ని పెరియ తిరుమొழி ప్రతిపాదించిందని, ద్వయార్థాన్ని తిరువాయ్‌మొழி ప్రబంధం తెలుపగా, చరమశ్లోకార్థాన్ని ఇయఱ్పా అనే భాగం వివరిస్తున్నదనే పూర్వాచార్యుల వివరణానికి పైన తెలిపిన వ్యాఖ్యానసూక్తులు అనుగుణంకదా!

## 8. ద్వయార్థం :

ముదల్ తిరువన్దాదిలోని ప్రతి పాశురం రసబంధురం. మిక్కిలి గహనాలైన, గంభీరాలైన శాస్త్రార్థవిశేషాలు ఎన్నో మనకు అడుగడుగునా గోచరిస్తాయి. వ్యాఖ్యాతలు వాటిని సూచించారుకూడా. **"శరణా మత్తై పయన్ద"** అనే 60వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ వ్యాఖ్యాతలు ఈ పాశురంలో **"భగవానుడు ప్రాప్యమేకాదు, ఉపాయంకూడా అతడే"** అనే గంభీరమైన అర్థం ప్రతిపాదింపబడిందని తెలియజేశారు. స్వామి అతడే అయినపుడు, అతనికి మనం సొత్తు అయినపుడు తనకు అతనికి దూరం అయిన తన సొత్తును తిరిగి పొందే ప్రయత్నం అతడే చేస్తాడని, కాబట్టి ఫలాన్ని అనుభవించేవాడుకూడా అతడేనని, ఈ అర్థవిశేషం శ్రీభాష్యం చివరలోగల **"న చ పరమపురుషః సత్యసంకల్పః అత్యర్థప్రియం జ్ఞానినం లబ్ధ్వా న కదాచి దావర్తయిష్యతి"** అనే సూక్తివల్ల స్ఫురిస్తుందని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారు తమ దివ్యార్థదీపికలో వివరించడం ఇచట భావ్యం. భగవానుడే ఉపాయం, ఉపేయమనే అనే తత్త్వం **"నెఱివాశల్ తానేయాయ్ నిన్ఱానై"** 3 అనే పాశురంలోకూడా ప్రతిపాదింపబడడం గమనార్హం.

ఈ రీతిలోనే ప్రబంధంలోని **"ఓరడియుమ్"** అనే చివరి పాశురంలోకూడా ఈ అర్థవిశేషమే అనుసంధింపబడిందని వ్యాఖ్యాతలు వివరించారు. ఇందువల్ల ఈ ప్రబంధంలో



ప్రాప్యప్రాపకాలు రెండూ భగవానుడేనని తెలియజేసే ద్వయమంత్రంయొక్క అర్థం పలుచోట్ల ఉపబృంహితమయినదనవచ్చు.

పై మూడు సమన్వయాలనుబట్టిచూస్తే ఈ ప్రబంధం రహస్యత్రయార్థపాదకమనే అభిప్రాయం మన పూర్వాచార్యులకు ఉన్నట్లు అవగతమవుతున్నది.

## 9. ఉపనిషత్‌సూక్తి సామ్యాలు :

**"వేదమ్ తమిழ் శెయ్‌ద మాఱన్"** అని అంటూ వేదార్థాలను తమిళభాషలో మార్చినవారుగా నమ్మాழ்వార్లు స్తుతింపబడుతున్నారుకదా! ఈ విషయం మిగిలిన అందఱి ఆழ்వార్లకు కూడా వర్తిస్తుంది. పూర్వాచార్యులు ఆழ்వార్ల ప్రబంధాలను వ్యాఖ్యానించేటపుడు ఆయా సందర్భాలలో వైదికసూక్తులకు, ఆழ்వార్ల సూక్తులకు మధ్య ఉన్న పలు శబ్దార్థ సాదృశ్యాలను ఎత్తి చూపారుకూడా. ఈ అంశాన్ని ముదల్ తిరువన్దాదిలో కూడా గమనించ వచ్చు. ఒకటి, రెండు ఉదాహరణలుమాత్రం ఇక్కడ నివేదింపబడుతున్నాయి.

**"యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః", "యతో వాచో నివర్తంతే"** ఇత్యాదిగా వేదం భగవద్వైభవాన్ని ఇతమిత్థంగా పరిచ్ఛేదించి పల్కడం ఎవ్వరికీ సాధ్యం కాదని అన్నది. అంతేకాదు, ఇంకో అడుగు ముందుకు వేసి, చివరకు భగవానుడుకూడా తన మహిమను తాను తెలియలేడని అన్నది. ఇందుకు **"యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ సో అంగ వేద యది వా న వేద"** అనే శ్రుతి సూక్తి ఒక ప్రమాణం. ఈ అర్థాన్ని ప్రకృతప్రబంధం **"విణ్ణకత్తాయ్.......ఉణరావార్ ఆర్ ఉన్ పెరుమై ఊழிతోరూழி"** (68) అని అంటూ అనుసంధించింది. నమ్మాழ்వార్లు కూడా ఇదే భావాన్ని **"యాను మేత్తి ఏழுలకుమ్ ముత్ఱుమ్ మేత్తి ప్పిన్నైయుమ్ తాను మేత్తిలుమ్ తన్నై ఏత్త ఏత్త ఎఙ్గెయ్‌దుమ్"** (తి.వా–4–3–10) అని వ్యక్తం చేశారు.

**"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి"** అని అంటూ వేదం విద్యుద్వర్ణాన్ని కల్గిన పరమ పురుషునినుండి కలాకాష్ఠాదిరూపాన్నికల కాలం ఆవిర్భవించిందని తెలిపింది. ఇచట చెప్పబడ్డ కాలం మిగిలిన జగత్తుకు అంతటికి ఉపలక్షణం అని ఆచార్యుల వివరణం. భగవానునకు ఈ విద్యుద్వర్ణం ఏ విధంగా వచ్చిందని ప్రశ్నిస్తే, హిరణ్యవర్ణ అయిన లక్ష్మీదేవికాంతి భగవానునిపై ప్రసరించడంవల్ల అతడు విద్యుద్వర్ణుడయ్యాడని అభిజ్ఞులైన పెద్దలు వివరించారు. సృష్టిసమయంలో భగవానుడు లక్ష్మీవిశిష్టుడనే విషయం దీనివల్ల స్ఫురిస్తున్నది. ఈ రహస్యాన్ని పొయ్‌కై ఆழ்వార్లు 61వ పాశురంలో **"ఉలకుమ్..... తిరుమాల్‌తన్ పున్దియిలాయ పుణర్ప్పు"** అని అంటూ తెలియజేశారు. ఇక్కడ **"తిరుమాల్"** అనే ప్రయాగం సాభిప్రాయకమని, సృష్టిసమయంలో భగవానుడు లక్ష్మీసహితుడనే విషయం దీనివల్ల వ్యక్తం అవుతున్నదని పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ విషయాన్నే ఆళవన్దార్ **"ఈషత్ త్వత్కరుణా...."** ఇత్యాదిగా చతుఃశ్లోకిలో, శ్రీకూరేశులు **"స్వస్తి శ్రీర్దిశతాత్"** ఇత్యాదిగా శ్రీస్తవంలో" శ్రీపరాశరభట్టర్ **"యద్భ్రూభంగా ప్రమాణం", "ఉల్లాస పల్లవిత..."**

ఇత్యాదిగా శ్రీగుణరత్నకోశంలో అనుసంధించారు. ఈ రెండు ఉదాహరణలు కేవలం దిఙ్మాత్రాలు. ఈ ప్రబంధంలో వేదార్థాలను వ్యక్తం చేసే ఇటువంటి సూక్తులు పరశ్శతాలు.

## 10. శ్రీరామాయణసూక్తి సామ్యం :

**"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"** అనే సూక్తి శ్రీరామాయణం వేదానికి ప్రతిరూపం అనే విషయాన్ని తెలుపుతున్నది. మన పూర్వాచార్యులుకూడా దివ్యప్రబంధ వ్యాఖ్యలలో ఎన్నో సందర్భాలలో ఆళ్వార్ల శ్రీసూక్తులకు, శ్రీరామాయణప్రమాణాలకు మధ్య కన్పించే పలు సామ్యాలను వివరించి చూపారు. ఇందుకు ప్రకృతప్రబంధంలోని ఒక్క ఉదాహరణ మాత్రం ఇక్కడ చూపబడుతున్నది. **"కున్ఱనైయ కుఱ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్......పుణనురైయే యాయినుమ్ పొన్నాళిక్కైయాన్ తిఱనురైయే శిన్దిత్తిరు"** 41 అనే ఈ ప్రబంధంలోని ప్రయోగం **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్"** అనే శ్రీరామచరమశ్లోకార్థాన్ని అనుసంధిస్తున్నది. ఈ శ్లోకంలోని **"మిత్రభావేన"** అనే ప్రయోగంయొక్క భావం **"పుణనురైయే యాయినుమ్"** అని, **"దోషో యద్యపి తస్య స్యాత్"** అనే సూక్తి భావం **"కున్ఱనైయ కుఱ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** అని అనువదింపబడింది. ఇటువంటి సామ్యాలు ఇంకా పలు ఉన్నాయి.

## 11. శ్రీవిష్ణుపురాణసూక్తిసామ్యం :

**"తత్ కర్మ య న్న బంధాయ సా విద్యా యా విముక్తయే, ఆయాసాయాపరం కర్మ విద్యాన్యా శిల్పనైపుణమ్"** అనే సూక్తిద్వారా శ్రీవిష్ణుపురాణం (1-19-4) బంధానికి కారణం కాని కర్మమాత్రమే కర్మ అని, ముక్తికి కారణమైన విద్యయే విద్య అని తెలిపింది. ఇదే అర్థాన్ని మరింత మధురంగా, సోదాహరణంగా పొయ్‌కై ఆళ్వార్లు **"పెయరుమ్ కరుఙ్కడలే నోక్కు మాఱు....ఒణ్ తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు"** (67) అనే పాశురంలో వ్యక్తం చేశారు. 7వ పాశురంలోని **"అఱైవిల్ శీర్ క్కణ్ణన్"** అనే సూక్తి అప్పిళ్ళై ఉరైలో- **"అపక్షయాది దోషఙ్గళ్ ఇన్ఱిక్కే"** అని వివరింపబడ్డవల్ల ఈ ప్రయోగం విష్ణుపురాణంలోని **"అపక్షయ వినాశాభ్యాం పరిణామర్ధిజన్మభిః"** అనే పరమాత్మస్వరూపాన్ని నిరూపించే సూక్తిని తలపిస్తున్నది. పౌరాణికసూక్తులతోగల ఇటువంటి సామ్యాలు ఇంకా చాలా ఉన్నా వ్యాఖ్యానంలో గతార్థాలు కాబట్టి ప్రస్తుతించడం లేదు.

## 12 గీతాసూక్తిసామ్యం :

**"భారతం పంచమో వేదః"** అనే సూక్తి భారతప్రాశస్త్యాన్ని తెలుపుతున్నది. **"భారతే భగవద్గీతా"** అనే ఇంకో సూక్తి ఆ భారతంలో సారతమమైన భాగం భగవద్గీత అని అంటున్నది. పలు గీతాసూక్తుల భావాలను ప్రకృతప్రబంధం అనుసంధిస్తున్నదనే విషయం వ్యాఖ్యానంలో స్పష్ట మవుతున్నది. ఉదాహరణకు ఒక సూక్తి మాత్రం ఇక్కడ ఉట్టంకింప



బడుతున్నది. గీతలో శ్రీకృష్ణభగవానుడు **"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"** అని అంటూ తనను ఏ రీతిలో భక్తుడు ఆరాధిస్తాదో ఆ రీతిలోనే వారిని నేను చేరతానని అన్నాడు. ఈ మధురార్థమే **"తమరుకన్దెవ్వురువమ్ అవ్వురువమ్ తానే"** (44) ఇత్యాది పాశురంలో ఉపబృహణం చేయబడ్డది. నమ్మాళ్వార్లు కూడా **"నెఞ్జినాల్ నినైప్పాన్ యవన్ అవనాకుమ్ నీళ్ కళ్లల్ వణ్ణనే"** అని ఈ అర్థాన్ని అనుసంధించారు. గీతలోని చరమశ్లోకార్థాన్ని గూర్చి ఇతఃపూర్వమే ప్రస్తుతింపబడింది.

## 13. అలంకార వైవిధ్యం :

ఆళ్వార్ల ప్రబంధాలను తాత్త్వికదృష్టిలోనేకాక, ఆలంకారిక శాస్త్రాంశాల దృష్టిలో కూడా వివేచన చేయవలసిన ఆవశ్యకత ఉన్నది. దివ్యప్రబంధాల్లోని ఎన్నో పాశురాలలో పలు అలంకారాలు అందంగా నిర్వహింపబడ్డాయనే విషయం ప్రతి సహృదయపాఠకుని మనస్సులో సద్యః స్ఫురిస్తుంది. ఇందుకు ముదల్ తిరువన్దాదిలోని మొదటి పాశురమే ఒక చక్కని ఉదాహరణం. ప్రారంభంలోనే **"వైయమ్ తకళియా"** అని అంటూ ఆళ్వార్లు భూమిని ప్రమిదగా, సముద్రాన్ని నేయిగా, సూర్యుణ్ణి జ్వాలగా, తమ పాశురసంపుటిని ఒక పూమాలగా రూపణం చేయడంలోని అందం అత్యంతం మనోహరం, ఎంతో ఆశ్చర్యకరం. **"ఎన్ఱు కడల్ కడైన్దదు"** అనే రెండవ పాశురంలో ఆళ్వార్లు ఎపుడో కృతయుగంలో జరిగిన సముద్రమథన, త్రివిక్రమక్రమణవృత్తాంతాలను మన కళ్ళముందు సాక్షాత్కరింప జేయడం ద్వారా **"భావికం భూతభవ్యార్థసాక్షాత్కారస్య వర్ణనమ్"** అని నిర్వచింపబడ్డ భావికాలంకారాన్ని వ్యక్తం చేశారు. **"అరవ మడల్ వేళ్లమ్"** (54) అనే పాశురంలో క్రమాలంకారం చక్కగా నిర్వహింపబడింది. సాభిప్రాయవిశేషణ ప్రయోగమూలకం అయిన పరికరాలంకారం **"తిరుమాల్ తన్ పున్దియిలాయ పుణర్ప్పు"** (61) ఇత్యాది పలు పాశురాలలో స్పష్టం. **"ఊరుమ్ వరి యరవమ్"** (38) అనే పాశురంలోని భ్రాంత్యలంకారం' **"మకిళ్లలక్కొన్ఱేపోల్"** (49) అనే పాశురంలోని ఉపమ సహృదయహృదయావర్జకాలు. ఈ విధంగా చూస్తే ఎన్నో పాశురాలలో పలు చక్కని ఆలంకారాలు మనోహరంగా దర్శనమిస్తాయి.

ఆళ్వార్లు ఈవిధంగా పలు అలంకారాలను ఆయా సందర్భాలలో తత్త్వావిష్కార దృష్టిలోనే ప్రయోగించారు. దీనిని వ్యాఖ్యాతలు సూచించారు కూడా. ఉదాహరణకు, 40వ పాశురంలో సరోయోగి **"వేళ్లమ్ ఇరు విశుమ్బిల్ మిన్ వీళ్ల కణ్డు అఞ్జుమ్"** అని అంటూ తిరుమలలోని ఏనుగులు ఆకాశంనుండి రాలిపడిన నక్షత్రాన్ని చూచి వేటగాళ్ళు విసరిన కొఱివికట్టెగా భ్రమించాయని చేసిన భ్రాంతిమదలంకారప్రయోగంద్వారా అస్థానే భయశంకతో భగవానునకు మంగళాశాసనం చేసే స్వభావం కలవారు నిండి ఉండే తిరుమలలోని తిర్యక్కులు సైతం అటువంటి స్వభావాన్ని కల్గి ఉన్నాయని సూచించారు - అని చెప్పవచ్చు. ఈ అంశాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై **"నిర్భయమాన దేశమ్. అస్థానే భయశంకై క్కొళ్ళుమిత్తనై"** అని అంటూ గంభీరంగా తెలిపారు.

## 14. అపూర్వపౌరాణిక వృత్తాంతాలు :

ఆళ్వార్ల పాశురాలలో భగవదవతారాలకు సంబంధించిన పలు వృత్తాంతాలు అనుసంధింపబడడం సర్వసామాన్యమైనా, వీటిలో కొన్ని వృత్తాంతాలు ప్రసిద్ధ పురాణాల్లో కన్పించనివికూడా ఉన్నాయి. పెరియాళ్వార్లు అనుసంధించిన శీమాలికవధ వృత్తాంతం ఇందుకు ఒక ఉదాహరణం. ఈ రీతిలోనే ముదల్ తిరువన్దాదిలో కూడా **"పూమేయ మాదవత్తోన్ తాళ్ పణిన్ద వాళరక్కన్ నీణ్ముడియై పాదమత్తాల్ ఎణ్ణినాన్ పణ్బు.."** (45) అనే పాశురంలో రావణుడు బ్రహ్మను వరాలను ప్రార్థించే సమయంలో భగవానుడు బ్రహ్మ ఒడిలో శిశువుగా మాఱి, ఆ రావణుని పది శిరస్సులను లెక్కించి చూపిస్తూ ఆ శిరస్సులను తాను భవిష్యత్తులో ఖండింపగలనని సూచించిన వృత్తాంతం ఉదాహరింప బడింది. ఈ వృత్తాంతాన్నే పేయాళ్వార్లు మూన్ఱామ్ తిరువన్దాదిలోని **"ఆయ్న్ద వఱు మఱైయోన్"** (77) అనే పాశురంలో, తిరుమళ్రిశై ఆళ్వార్లు నాన్ముకన్ తిరువన్దాదిలోని **"కొణ్డు కుడఙ్గాల్ మేల్"** (44) అనే పాశురంలో ప్రస్తావించారు. ఈ కథ ప్రస్తుతం లభించే పౌరాణికవాఙ్మయంలో ఎక్కడ ఉన్నదో తెలియలేదు – అని మహావిద్వాన్ కాంచీ ప్ర.భ.అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో తెలిపినందున ఇది ఒక అపూర్వమైన వృత్తాంతమని చెప్పవలసి ఉన్నది. ఇటువంటివాటిని పూర్వాచార్యులు కల్పాంతరంలో సంభవించినవిగా సమాధానించగా, ఆధునికవిమర్శకులు జానపద దేశ్యసాహిత్యాల ప్రభావాన్ని ఇవి నిరూపిస్తున్నవని భావించారు. **"అడుత్త కడుమ్ పకైఞర్క్కు"** (80) అనే పాశురంలో ప్రస్తావింపబడ్డ సుముఖుని వృత్తాంతంకూడా అంత ప్రాచుర్యంలో లేనిదే. **"ఆలనిళల్ కీళ్ అఱనెఱియై"** అనే పాశురంలో ఉపనిషద్గతమైన జాబాలి వృత్తాంతాన్ని పేర్కొనడంకూడా ఇక్కడ స్మరించతగినది. ఇటువంటి అపూర్వ గాథలను ప్రస్తావించడంద్వారా ఆళ్వార్లు తత్త్వార్థాలను మధురమైన రీతిలో అందించడం గమనించతగ్గ మఱొక విషయం.

## 15. శ్రీవేంకటాచలప్రాధాన్యం :

ముదల్‌తిరువన్దాదిలో పలు దివ్యదేశాల ప్రస్తావన ఉన్నా, వానిలో శ్రీవేంకటాచలానికిగల ప్రాధాన్యం ఇంకొక క్షేత్రానికి లేదు. పొయ్‌కై ఆళ్వార్లు వేంకటాచలాన్ని మొత్తం 10 పాశురాలలో కీర్తించడం, ఇన్ని పాశురాలలో మఱి వేఱొక ఏ దివ్యదేశాన్ని కీర్తించక పోవడం ఈ విషయాన్ని ఋజువుచేస్తున్నవి. దీనినిబట్టి పొయ్‌కై ఆళ్వార్ల కాలంనాటికి వేంకటాచలానికి గల ప్రసిద్ధి, ప్రాధాన్యం వ్యక్తం అవుతున్నవి. **"వేఙ్గడవర్ తిరుమలైయై విరుమ్బుమవర్ వాళియే"** అనే వీరి వాళ్రిత్తిరునామంలోని సూక్తి ఇచట స్మరణీయం.

## 16. కురున్ద (బండి  గురువింద) చెట్టును కూలగొట్టిన వృత్తాంతం :

27వ పాశురంలో కన్పించే ఈ వృత్తాంతం శ్రీకృష్ణుని బాల్యలీలలో ఒకటి. ఇది ప్రాచీనతమిళవాఙ్మయంలో చాలా చోట్ల పేర్కొనబడింది. **"కోకులమేయ్‌త్తు క్కురున్దొశిత్తానెన్బరాల్"** అని శిలప్పదికారంలో, **"కామరు శీర్ త్తణ్ణఋమ్ పూఙ్కురున్ద ఞాయ్‌త్తతూఉమ్"** అని త్రికటుకంలో ఈ లీల కీర్తింప బడింది. మిగిలిన ఆళ్వార్లు కూడా ఈ లీలను కీర్తించారు.



ఈ వృత్తాంతం రెండు రీతుల్లో వివరింపబడింది. శ్రీకృష్ణుడు యమునానదీతీరంలో గోపికల వస్త్రాలను అపహరించి బండి గురువింద చెట్టు పైకి ఎక్కినపుడు అంతకుముందే కంసప్రేరితుడై అక్కడకు వచ్చిన అసురుడొకడు కృష్ణుణ్ణి వధించాలని  ఆ చెట్టులో ఆవేశించి, సమయం కోసం కాచుకొని ఉండడం గమనించిన స్వామి ఆ చెట్టును కూలగొట్టి అసురుని వధించినట్లు కథనం. **"కొల్లైయఞ్జార క్కురున్దొశిత్త మాయవన్"** అనే శిలప్పదికార ప్రయోగాన్ని **"అడియార్క్కు నల్లవర్"** అనే వ్యాఖ్యాత **"పునక్కొల్లైయై చ్చార్న్దవిడుత్తు వఞ్జనైయాల్ వన్దు నిన్ఱ కురున్దై ముఱిత్త మాయవన్"** అని వ్యాఖ్యానించడం, ప్రకృతప్రబంధంలోని **"కురున్దొశిత్త"** అనే ప్రయోగాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై **"అసురావిష్టమాన కురున్దు"** అని వివరించడం గమనించతగ్గవి.

జీవకచింతామణి అనే ద్రావిడగ్రంథంలోని **"కురున్దవనొశిత్తదెన్ఱాన్"** అనే సూక్తిని **"నచ్చినార్క్కినియర్"** అనే వ్యాఖ్యాత **"వేన్దే! మాయోన్ పల తుకిల్‌కళై క్కవర్న్దు తమ్మునాకియ పానిఱవణ్ణన్ నోక్కిన్ వళ్రియదైత్తెన్దుకాణ్, తొళ్రునైయార్గ్రిలే కోవియర్క్కు క్కురున్దొశిత్తు, ఇ.్.దు అఙ్గనమ్ తీదు ఎన్ఱాన్ ఎన్గ"** అని వ్యాఖ్యానించడంవల్ల యమునానదీతీరంలో గోపికల వస్త్రాలను తాను అపహరించినపుడు బలరాముడు ఆ దెసగా రావడాన్ని గమనించిన కృష్ణుడు తనను మఱుగుపఱచుకోవడంకోసం, గోపికల మానసంరక్షణకోసం కురున్దువృక్షశాఖలను విఱిచినట్లు తెలుస్తున్నది. ఈ విధంగా ఈ వృత్తాంతం వేఱే రీతిలో వివరింపబడడం తమిళదేశంలో ప్రాచీన కాలంనుండి కన్పడడమేకాక, జైనసాహిత్యంలో కూడా ఇటువంటి వివరణం చాలా సందర్భాలలో ఉన్నది. భాగవతంలో శ్రీకృష్ణుడు ఎక్కిన చెట్టు కడిమి (కదంబ) వృక్షమని పేర్కొనబడడం గమనించతగ్గది. పై రెండు వివరణలలో మొదటి, వివరణే ప్రస్తుతప్రబంధంలో అన్వయిస్తుంది. ఈ విషయం వ్యాఖ్యానసూక్తులలో స్పష్టపడుతున్నది కూడ.

## 17. నప్పిన్నై వృత్తాంతం :

ఆళ్వార్ల దివ్యప్రబంధాలలో శ్రీ–భూ–నీళాదేవుల ప్రస్తావనలు పలు కన్పిస్తున్నా. వాటిలో నీళాదేవి ప్రస్తావన మిగిలిన ఇద్దఱి ప్రస్తావనలకంటే చాలా ఎక్కువ. ఈమెకు ద్రావిడభాషలో **"నప్పిన్నై"** అని వ్యవహారం. ఈమెను గూర్చిన ప్రసక్తి ప్రాచీన తమిళవాఙ్మయంలో పలు చోట్ల కన్పిస్తున్నది. **"వైయ మళన్దాన్ఱన్ మార్బిగ్రిరు నోక్కా ప్పెయ్‌వళైక్కైయాళ్ నప్పిన్నై తానుమ్"** అని శిలప్పదికారంలోనూ, **"మామణివణ్ణను న్తమ్మునుమ్ పిఞ్ఞైయుమ్ ఆడియ కురవైయి... తామెన వేత్తియుమ్"** అని మణిమేకలైలోను,

**"తిరుమకట్కు క్కేళ్వనుమ్ నీణిరై నప్పిన్నైయిలలవరర్వాయిన్నమిర్ద మెయ్దినానన్తే"** అని జీవకచింతామణిలోను, **"ఏర్పిన్నైతోళ్మున్ మణన్దవన్"** అని తిరుక్కోవైయార్‌లోను, **"పిన్నై నమ్బుమ్ పుయన్దాన్"** అని తేవారంలోనూ ఈమె ప్రస్తావన కానవస్తున్నది. ఈమె గోపకులకన్యక అని, ఈమెను వివామాడడంకోసం కన్యాశుల్కంగా నిర్ణయించిన ఏడు పొగరుబెద్దులను మర్దించి శ్రీకృష్ణుడు ఈమెను వివాహమాడాడని **"కలిత్తొకై"** వంటి ప్రాచీనద్రావిడగ్రంథాలు పేర్కొంటున్నాయి. ఈ ఏడు ఎద్దులు పలు వర్ణాలను కల్గినవని కూడా శిలప్పదికారం తెలిపింది. ఒకనాటి సాయంవేళ యమునానదీతీరంలో ఈమె విహరిస్తుండగా ఈమె అందానికి, శ్రీకృష్ణుడు ఆకృష్టుడయ్యాడని శిలప్పదికారంవంటి ప్రాచీన తమిళవాఙ్మయంలో చెప్పబడింది. శిలప్పదికారంకంటె ప్రాచీనమైనదిగా భావింప బడే **"కలిత్తొకై"** లో కన్యలను వివాహమాడగోరే వరునకు పొగరుబెద్దులను స్వాధీనపఱచు కోవడాన్ని కన్యాశుల్కంగా నిర్ణయించే సంప్రదాయం పూర్వం తమిళదేశంలో ఉన్నట్లు తెలుపబడింది. ఉత్తరదేశంలో ప్రచురంగా కన్పించే రాధావృత్తాంతాన్ని ఈ తమిళ సంప్రదాయంతో సమన్వయపఱచడంద్వారా నప్పిన్నై వృత్తాంతం ఆవిర్భవించి ఉండవచ్చునని కొందఱు నవీనవిమర్శకులు భావించగా, మఱికొందఱు ఈ వృత్తాంతం పూర్తిగా తమిళ సంప్రదాయమూలకమైనదేన తలుస్తున్నారు.

**"నీళాతుంగస్తనగిరితటీ"** అనే తిరుప్పావై తనియన్ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్, యశోదాదేవికి సహోదరుడైన కుంభుని కుమార్తెయే నీళాదేవి అని, శ్రీకృష్ణుడు సప్తవృషభాలను భంజించి ఈమెను వివాహం చేసికొన్నాడని తెలిపే హరివంశం లోని సంస్కృత శ్లోకాలను ప్రమాణంగా ఉదాహరించారు. ఇందువల్ల ఈమె గోపజాతికన్యక అన్నది పురాణకథనమని స్పష్టమౌతున్నది.

సంస్కృతవాఙ్మయాన్ని గమనిస్తే శ్రీకృష్ణునకున్న పలువురు భార్యలలో అష్ట మహిషులుగా చెప్పబడే ఎనిమిదిమంది పత్నులు ప్రధానలు. నగ్నజిత్ అనే అయోధ్యానగర ప్రభువుకు సత్యవతి అనే నామాంతరంకల నాగ్నజాతి అనే కుమార్తె కల్గింది. అద్భుత సౌందర్యరాశి అయిన ఈమెను పరిణయం చేసికోవడంకోసం పలువురు రాజులు ముందుకు రాగా, నగ్నజిత్ తనకు సామంతరాజు, యశోదాదేవికి సహోదరుడైన కుంభాండుని వద్ద ఉన్న ఏడు పొగరు పట్టిన ఎద్దులను అణచినవానికి తన కుమార్తెను ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడట. శ్రీకృష్ణుడు ఆ ఎద్దులను మర్దించి నాగ్నజితిని కైవసం చేసికొన్నాడని భాగవతంలో తెలుపబడింది. ఇచటి కథాసామ్యాన్నిబట్టి నాగ్నజితియే నీళాదేవి అని భావిస్తే- నీళాదేవి క్షత్రియకన్య అని అంగీకరించవలసి ఉంటుంది. పైగా పేరులో కూడా తేడా ఉన్నది. **"నీళా కులేన సదృశీ"** అనే కూరేశుల సూక్తికి విరోధంగా కూడా వస్తుంది. కాబట్టి నాగ్నజితి - నప్పిన్నై వృత్తాంతాలు రెండు భిన్నాలనే భావించాలి.



నప్పిన్నైప్పిరాట్టినిగూర్చిన ఆధునికవిమర్శకుల అభిప్రాయాలు ఇంకా చాలా ఉన్నా, విస్తరభీతివల్ల ఇచట దిఙ్మాత్రంగా కొన్ని మాత్రమే ప్రస్తావించబడ్డాయి.

## 18. మిగిలిన ఆళ్వార్ల ప్రబంధాలు-ముదల్ తిరువన్దాది:

ముందున్న కవుల ప్రభావం అనంతరకాలానికి చెందిన కవులలో కన్పడడం సహజం. ఈ అంశం ఆళ్వార్ల సాహిత్యంలో కూడా కన్పిస్తుంది. **"వైయమ్ తకళియా"** అని పొయ్‌కై ఆళ్వార్లు తమ ప్రబంధాన్ని ప్రారంభించిన రీతిలోనే పూదత్తాళ్వార్లు కూడా **"అన్బే తకళియా"** అని అంటూ తమ ప్రబంధాన్ని ఆరంభించడం ఇందులకొక నిదర్శనం. **"పేశిగ్గ్రే పేశలాల్లాల్"** అనే రీతిలోని ఆళ్వార్ల సూక్తులలో కన్పించే ఈ భావసామ్యాలను వ్యాఖ్యాతలు వీలున్నపుడల్లా మనకు తెలియజేశారు. **"వాయవనై యల్లదు వాళ్త్తాదు"** 11 అనే పాశుర ప్రక్రియలోనే నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్లిలో **"ముడియానే"** (3-8) అనే దశకార్థాన్ని అనుసంధించారు. **"పెయరుమ్ కరుమ్ కడలే నోక్కు మాఱు"** (67) అనే సూక్తిభావాన్ని **"తొక్కిలఙ్గు యారెల్లామ్"** అనే పాశురంలోను, **"ఒణ్‌పూ మలరుమ్ కదిరవనే నోక్కుమ్"** 67 అనే సూక్తిభావాన్ని **"శెన్దళులే వెన్దళులై"** అనే పాశురంలో కులశేఖరులు అనుసంధించారు. **"ముదలావార్ మూవర్......ముదలావాన్ మూరినీర్‌వణ్ణన్"** (15) అణే సూక్తిని అనుసరిస్తూ నమ్మాళ్వార్లు **"మూవరాకియ మూర్త్తియై ముదల్ మూవర్‌క్కుమ్ ముదల్‌వన్‌తన్నై"** (3-6-2) అని పలికారు. ఇటువంటి భావసామ్యాలు ఆళ్వార్ల ఐకకంఠ్యాన్ని నిరూపిస్తాయి. వీటిని **వాగమృతవర్షి, వేళ్విక్కుడి వరదాచార్యస్వామివారు** సంకలనం చేసిన **"అరుళిచ్చెయల్ అనుభవమ్"** అనే గ్రంథం మొదటిభాగంలో విస్తృతంగా చూడవచ్చు.

ఆళ్వార్లు 25వ పాశురంలో **"ఉరై మేళ్కొణ్డు ఎన్నుళ్ళమ్"** అని తమ మనస్సు వాగింద్రియవ్యాపారాన్ని తనయందు ఆరోపించుకొన్నదని పలికారు. సరిగా ఇటువంటి స్థితినే నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్లిలోని **"ముడియానే"** (3-6) అనే దశకంలో వ్యక్తీకరించారు.

గోదాదేవి నాయ్‌చ్చియార్ తిరుమొళ్లిలోని **"కరుప్పూరమ్ నాఱుమో"** ఏడవ దశకంలో పాంచజన్యశంఖంయొక్క మహిమను తెలిపి, తరువాత **"విణ్ణీల మేలాప్పు"** అనే దశకంలో మేఘాన్ని దూతగా పంపింది. శంఖానికి, మేఘానికి ఈ విధంగా ఒక విధమైన పొందిక ఉన్నది. సరోయోగి భగవానుని తిరుమేనిని మేఘంగా వర్ణిస్తూ, అందులో శంఖం ఉన్నదంటూ "కార్‌క్కోదు పఱ్ఱియాన్ కై" (27) అని తెలిపారు. ఈ పాశురాన్ని ఉదాహరిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై **"విణ్ణీల మేలాప్పు"** అనే దశకానికి అవతారికను అనుగ్రహించిన తీరు అత్యద్భుతం.

పొయ్‌కై యాళ్వార్లు భగవత్సంబంధంవల్ల సముద్రానికి కల్గిన అతిశయాన్ని **"మాలుమ్ కరుమ్ కడలే"** (19) అని పాశురంలో పల్కగా, ఈ అంశాన్నే కులశేఖరులు

**“మాలై యుగ్ఱ్ఱ కడల్”** (2-8) అని అంటూ అనుసంధించారు. భగవద్భక్తులనుగూర్చి యమభటులు విచారించరు అని అంటూ పొయ్‌కై యాళ్వార్లు (55) పల్కిన విషయాన్ని తిరుమళ్రిశైయాళ్వార్లు **“నమన్... ఇఱన్ద కుగ్ఱ్ఱమ్ ఎణ్ణవల్లనే”** (తిరుచ్చంద-116) అని, నమ్మాళ్వార్లు **“కూగ్గ్రిన్ తమర్‌కళుమ్ కుఱుకకిల్లార్”** (10-2-1) అని, కలియన్ **“నమన్‌తమర్ ఎన్‌తమరై వినవప్పెఱువార్ అలర్”** (10-6-5) అని అనుసంధించారు. ఈవిధంగా అర్థసామ్యాలే కాక, శబ్దసామ్యాలు కూడా **“కోణా కణైయాన్”** (ముదల్ తిరు-63), **“కోణా కణైయాన్”** (పెరియతిరు 1-10-65) వంటివి చాలా ఉన్నాయి.

సరోయోగి తమ ప్రబంధంలో పూర్వం తాము ప్రస్తావించిన విషయాన్నే ముఖ భేదంతో మళ్ళీ అనుసంధించిన సందర్భాలు కూడా ఉన్నాయి. వీటిని ఆలంకారిక దృష్టిలో చూచినపుడు ఒక విలక్షణమైన సంవాదాలుగా చెప్పవచ్చు. **“సంవాదో హన్యసాదృశ్యమ్”** అని కదా సంవాదలక్షణం. ఇక్కడ అన్యశబ్దానికి అన్యకవి సూక్తి అనేకాకుండా, ఒకే కవి యొక్క ఇంకొక సూక్తి అనికూడా గ్రహించవచ్చును కదా! **“పొరుకోట్టు ఓర్ ఏనమాయ్ పుక్కిడన్దాయ్‌క్కు అన్టు ఒరుకోట్టిన్‌మేల్ కిడన్దదన్డే”** అంటూ 9వ పాశురంలో సరోయోగి వరాహమూర్తి రూపంయొక్క అతిశయాన్ని కీర్తిస్తూ పల్కినట్లే, 84వ పాశురంలోకూడా - **“పిరానున్ పెరుమై పిఱరారఱివార్, ఉరా ఉలకళన్ద నాన్టు వరాకత్తైయిగ్ఱ్ఱళవు పోదావాఱెన్‌కొలో? ఎన్టై అడిక్కళవు పోన్దపడి”** అని అంటూ ఈ అర్థాన్ని పునః అనుసంధించడం దీనికొక ఉదాహరణగా గ్రహించవచ్చు.

## 19. ముదల్ తిరువన్దాది సూక్తులు - అన్యద్రావిడగ్రంథాల సూక్తులసామ్యాలు

పరమేశ్వరుడు అగస్త్యపులస్త్యాదులు నల్గురకు వటవృక్షచ్ఛాయలో బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించిన వృత్తాంతాన్ని సరోయోగి 4వ పాశురంలో ప్రస్తావించగా, **“తేవారమ్”** అనే గ్రంథంలో అప్పర్ **“ఆలిన్‌కీళ్ అఱమ్ నాల్‌వర్‌క్కు అన్టురైత్తాన్”** (4-6-10), **“ఆలినిళ్ళ తీక్కిరున్దు ఆరణమ్ ఓది”** (4-107-6) ఇత్యాదిగా ఈ వృత్తాంతాన్ని పలుమార్లు అనుసంధించారు.

పూతన విషస్తన్యాన్ని ఆస్వాదించిన స్వామిని తప్ప నా నోఱు ఎవ్వరినీ కీర్తించదు, చేతులు లోకాన్ని కొలిచినవానినితప్ప ఎవరికీ నమస్కరించదు” ఇత్యాదిగా సరోయోగి పల్కిన భావాన్నే **“శోవరణుమ్ పోర్‌ముడియ త్తొల్లిలజ్లై కట్టళ్రిత్త శేవకన్‌శీర్ కేళాద శెవి ఎన్న శెవియే, తిరుమాల్‌శీర్ కేళాద శెవి ఎన్నశెవియే”** ఇత్యాదిగా శిలప్పదికారంలో ఇలజ్కోవడికళ్ ఆయ్‌చ్చియర్‌కోవైలో పాడడాన్ని గమనించవచ్చు. పోతనకూడా ఈ భావాన్ని **“కమలాక్షు నర్చించు కరములు కరములు”** అని అంటూ అనుసంధించాడుకదా.



## 20. ముదల్ తిరువన్దాది-పూర్వాచార్యసూక్తులు

ఆళ్వార్ల శ్రీసూక్తుల ప్రభావం పూర్వాచార్యులందఱిపైన స్పష్టంగా గోచరిస్తున్నది. **“శెన్టాల్ కుడైయామ్”** అనే పాశురాన్ని శ్రీయామునులు స్తోత్రరత్నంలో **“నివాసశయ్యాసన”** ఇత్యాదిశ్లోకంగా అనువదించడం, **“ఎళ్లువార్ విడైకొళ్ వార్”** అనే రస్యమైన పాశురాన్నిబట్టి శ్రీరామానుజులు గీతలోని **“ఆర్తో జిజ్ఞాసుః”** అనే శ్లోకాన్ని వ్యాఖ్యానించేటపుడు అర్థులను మూడు రీతుల్లో వర్గీకరించడం, **“మకిళ్లల క్నొన్టేపోల్”** అనే పాశురభావాన్ని శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవంలో **“పటునైవ వరాటికైవ క్లుప్తా”** అనే శ్లోకంలో అనుసంధించడం ఇందులకు కొన్ని ఉదాహరణలు. **“తిరుమకళుమ్”** అనే 42వ పాశురంలోని భావాన్ని పరాశరభట్టర్ శ్రీ గుణరత్నకోశంలో **“భోగ్యా వా మపి”** ఇత్యాది (26) శ్లోకంలో అనుసంధించారు.

రహస్యగ్రంథాల నిర్మాణంలోకూడా ఈ ఆళ్వార్ల సూక్తులు పూర్వాచార్యులకు మార్గదర్శకాలు అయ్యాయి శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడిలోని తిరుమంత్ర ప్రకరణంలో **“ఇత్తాల్-తామరైయాళ్‌కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు - ఎన్టదాయిగ్ఱ్ఱు”** (73) అని అంటూ ఈ ప్రబంధంలోని సూక్తి ప్రమాణంగా ఉట్టంకించడం దీన్ని ఋజువు చేస్తున్నది. ఇటువంటి సందర్భాలు ఇంకా ఎన్నో ఉన్నాయి.

## 21. ముదల్‌తిరువన్దాది వ్యాఖ్యానాలు-పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య :

నాలాయిరదివ్యప్రబంధాన్ని పూర్తిగా వ్యాఖ్యానించిన పరమకారుణికులు, పెరియవాచ్చాన్‌పిళ్ళై ముదల్‌తిరువన్దాదికికూడా రస్యమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఇది పలు సంగ్రహంగా ఉన్నది. తిరువాయ్‌మొళ్రి వ్యాఖ్యలో చాలా విషయాలు గతార్థాలు కాబట్టి పలుచోట్ల ఇయఱ్పావ్యాఖ్యను పెరియవాచ్చాన్‌పిళ్ళై చాలా సంగ్రహంగా కృపజేశారని పెద్దలంటారు. అయినా, చాలా పాశురాల వ్యాఖ్యానాలలో ఈ ఆచార్యవర్యులు రెండు మార్లు అవతారికలను, వ్యాఖ్యలను అనుగ్రహించడం ఈ ప్రబంధగౌరవానికి ప్రబలసాక్షి. ఈ వ్యాఖ్యకు పూర్వుల అరుంబదం ఒకటి ఉన్నది. ఇవి రెండు సుమారు 100 సం.క్రితం శ్రీవైష్ణవగ్రంథముద్రాపకసభ, చెన్నైవారిద్వారా ప్రచురింపబడ్డాయి ఈ గ్రంథంలో పాశురాలకు తెలుగులో ప్రతిపదార్థ తాత్పర్యాలుకూడా ఇవ్వబడ్డాయి. ఈ ప్రతులిపుడు దుర్లభాలు. ఈవ్యాఖ్యను చాలా సందర్భాల్లో (ఉదాహరణకు 60వ పాశురవ్యాఖ్య) తాళపత్ర గ్రంథాలను చూచి పరిష్కరించుకోవాలని శ్రీ అణ్ణాస్వామి అన్నారు. ముద్రింపబడిన గ్రంథాలలో పెరియవాచ్చాన్‌పిళ్ళై వాఖ్యానంలో అక్కడక్కడ కొన్ని పాఠభేదాలే కాకుండా, కొన్ని అధిక పాఠాలుకూడా కనిపిస్తున్నాయి. ఉదాహరణకు 12వ పాశురానికి గల పెరివాచ్చాన్‌పిళ్ళై వాఖ్యానాన్ని గమనించవచ్చు.

## 22. అప్పిళ్ళై ఉరై :

ఈ ప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానం ఉన్నా 'అది చాలాచోట్ల సంగ్రహంగా ఉన్నందున, అన్వయక్రమంలో లేనందున, పండితైకగమ్యం అయినది. సామాన్యుల అవగాహనకు ఆ వ్యాఖ్య చాలదని తలచిన శ్రీమద్వరవరమునుల శిష్యులలో ఒకరైన అప్పిళ్ళై ఇయఱ్పాలోని నాల్గు తిరువన్దాదులకు, ఇంకా కొన్ని ప్రబంధాలకు ప్రతిపదార్థ రూపమైన ఉరైను కృపజేశారు. దీనివల్ల పాశురభావాన్ని సులభంగా అందఱు గ్రహించే వీలు కల్గింది. ఈ వ్యాఖ్యకూడా నూఱుసంవత్సరాలకు ముందు ముద్రింపబడింది. ప్రస్తుతం ఆ ప్రతులుకూడా లభించడం లేదు.

ఈ వ్యాఖ్యలో కొన్ని అపూర్వ విశేషాలున్నాయి. మూడవ పాశురంలోని **"పెరుమాన్ అటికిలేన్ నీయళవు కణ్ణ నెఱి"** అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ అప్పిళ్లై **"అటికిలేన్ నీ యళవు కణ్ణ నెఱి – ఎన్గిఱదు – నీ ఎన్‌తిఱత్తిల్ నినైత్తిరుక్కిఱదు ఎన్న వెన్ఱు అటికిఱిలేన్"** అని వ్యాఖ్యానించడంద్వారా ప్రస్తుతసూక్తికి, తిరుమంగైమన్నన్ అనుగ్రహించిన పెరియ తిరుమొழி లోని **"ఉన్‌మనత్తాల్ ఎన్ నినైన్దిరున్దాయ్"** (2–7–1) అనే సూక్తినిగల అర్థసామ్యం స్ఫురింపజేయబడింది. అంతేకాక, ఈ పాశురవివరణలోనే పూతనావధ వృత్తాంతంలోని తత్త్వాన్ని ఆవిష్కరిస్తూ – **"స్వయత్నత్తాలే అవనై యటియప్పుకిల్ పూతనై పట్టదు పడు వరెన్ఱు కరుత్తు"** అని అనుగ్రహించడంకూడా ఇక్కడ గమనించ తగినది. ఇటువంటి విశేషాలు ఈ వ్యాఖ్యలో పలుచోట్ల కన్పిస్తాయి. ఈ వ్యాఖ్యను ముద్రించేటప్పుడు ప్రతీకలు లేకుండా కేవలం ఉరై(ప్రతిపదార్థం)ని మాత్రం ఉ.వే. శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ ముద్రించారు. కాని, పూర్వం ప్రచురింపబడ్డ గ్రంథాల్లో ఈ ఉరై పాశుర ప్రతీకలతో సహా ముద్రింపబడ్డంవల్ల ఆవిధానమే ప్రస్తుతం అనుసరింపబడింది.

## 23. నమ్బిళ్లై పడి

తిరువాయ్‌మొழி ప్రబంధానికి **'ఈడు'** అనే విస్తృత వ్యాఖ్యను అనుగ్రహించిన నంబిళ్ళై తిరువిరుత్తం, తిరుప్పళ్ళి యెழுచ్చి వంటి ఇంకాకొన్ని దివ్యప్రబంధాలకుకూడా వ్యాఖ్యానాన్ని కటాక్షించారు. కాని, తిరువన్దాది ప్రబంధాలకు వ్యాఖ్యానం చేసినట్లు ఇంతవరకు లోకానికి తెలియదు. చిరకాలంగా చెన్నై గవర్నమెంటు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో లిఖితప్రతులుగా నిద్రాణంగా ఉన్న నంబిళ్ళై ముదల్ తిరువన్దాదికి కృపజేసిన **"నమ్బిళ్ళైపడి"** అనే వ్యాఖ్యను సేకరించి, పరిష్కరించి, సరళమైన తమిళ వివరణంతో 5–6సం॥ల క్రితం ఉ.వే. **శ్రీమాన్ డా. ఎం.ఏ. వేంకటకృష్ణన్ స్వామివారు (గీతాచార్యన్** మాసపత్రికా సంపాదకులు) తమ తమిళ మాసపత్రిక **"గీతాచార్యన్"** లో ధారావాహికంగా ప్రచురించారు. వీరికి శ్రీవైష్ణవలోకం కృతజ్ఞతను తప్పక సమర్పించు కొనవలసి ఉన్నది. ఈ వ్యాఖ్య ప్రాయికంగా చాలాచోట్ల పెరియవాచ్చాన్‌పిళ్ళైవ్యాఖ్యతో పోలి ఉంది. పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య కంటె సుగమంగా ఉన్నది.



## 24. దివ్యార్థ దీపికావ్యాఖ్య :

20వ శతాబ్దిలో విశిష్టాద్వైతసంప్రదాయాన్ని తమ గ్రంథ ప్రచురణలద్వారా, ఉపన్యాసాలద్వారా ఆసేతుహిమాచలం ప్రచారం చేసిన ప్రాతఃస్మరణీయులు, కీర్తిమూర్తులు, పద్మవిభూషణ, మహామహిమోపాధ్యాయేత్యాది బిరుదభూషితులు, ఉ.వే.మహావిద్వాన్. కాంచీ ప్ర.భ.అణ్ణంగరాచార్యస్వామివారు నాలాయిర దివ్యప్రబంధవాఙ్మయాన్ని సంపూర్ణంగా వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యకు దివ్యార్థదీపిక అని పేరు. ముదల్‌తిరువన్దాదికి వీరు కృపజేసిన, అత్యంతమధురమైన దివ్యార్థదీపికా వ్యాఖ్యలో పలు జ్ఞాతవ్యాంశాలు ఉన్నాయి. ప్రత్యేకించి **"కున్ఱనైయ కుఱ్ఱమ్ శెయినుమ్"** అనే (41) పాశురంలో వీరు వాత్సల్య గుణాన్నిగూర్చి చేసిన విస్తృతవిచారం అవశ్యం గమనించతగినది.

15వ పాశురంలో సరోయోగి చేసిన **"నామ నీర్"** అనే ప్రయోగంలోని **'నామ'** పదానికి ప్రసిద్ధం, నామమాత్రం – అనే అర్థాలను పూర్వవ్యాఖ్యాతలు చెప్పగా, అణ్ణాస్వామి వారు **"నామమ్"** అనే పదానికి **'పేర్'** అనే అర్థం ఉన్నందున, **'పేర్'** అనే ద్రావిడపదానికి గొప్ప అనే అర్థం ఉన్నది కాబట్టి, ఈ **'నామమ్'** అనే పదం లక్షితలక్షణా ప్రక్రియలో (ద్విరేఫశబ్దంవలె) గొప్ప అనే అర్థాన్ని ఇస్తుందని వివరించారు. ఇందుకు నిదర్శనంగా విల్లిపుత్తూరార్ భారతంలోని **"తిజ్గళ్ శేర్ పెయరినాన్"** అనే ప్రయోగాన్ని కూడా ఉదాహరించారు. **"తழுమ్బిరున్ద"** 23వ పాశురంలో **"కడైనిలైత్తీవకమ్"** (అంత్యదీపకం) అనే అలంకారం ప్రయోగింపబడింది అని వివరించారు.

పలుచోట్ల పాఠపరిష్కారాలు చేశారు. ఉదాహరణకు 24వ పాశురంలో **"విరలోడు"** అనే రెండవపాదంలోని పాఠం కంటె **"విరలాడు"** అనే పాఠమే యుక్తమని తెలిపారు. ప్రస్తుత గ్రంథంలో ఈ వ్యాఖ్య తెలుగులిపిలో ముద్రింపబడడంతోపాటు దీనికి తెలుగులో అనువాదంకూడా చేయబడడం విశేషం. ఈ వ్యాఖ్యానాలేకాకుండా ఇంగ్లీషులో, తమిళంలో ఈ ముదల్‌తిరువన్దాది ప్రబంధానికి లఘువివరణలతోకూడిన గ్రంథాలు చాలా వచ్చాయి.

## 25. ప్రకృతముద్రణనుగూర్చి :

తిరువాయ్‌మొழி, తిరుప్పావైవంటి కొన్ని ప్రబంధాలు జనప్రచారంలో ఉన్నందున ఆ ప్రబంధాల వ్యాఖ్యలు కొంతవరకు దొరుకుతున్నాయి. ముదలాయిరమ్, పెరియ తిరుమొழி, ఇయఱ్పా–అనే మిగిలిన మూడు వేలకు, ప్రత్యేకించి ఇయఱ్పాకు పూర్వాచార్య వ్యాఖ్యాన శ్రీకోశాలు ఇపుడు దొరకడం లేదు. అందుచేత వీటిని పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. ఈ ఆవశ్యకతను చూచిన దాసుడు, మొదటగా ముదల్ తిరువన్దాదికి సంబంధించిన పూర్వుల వ్యాఖ్యలను, అరుంబదాన్ని, వాటిలోని విశేషాలతో కూడిన తెనుగు వివరణాన్ని, వీటితోపాటు కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారి దివ్యార్థ దీపికను,

ఆ వ్యాఖ్యకు ఆంధ్రీకరణను ఒక చోట చేర్చి ముద్రిస్తే అందఱికీ ఉపయోగపడుతుందని తలచి ఈ ప్రయత్నాన్ని చేశాడు. దాసుడు చేసే ఈ ప్రయత్నాన్ని **"శ్రీయతీంద్ర ప్రవణకైంకర్యసభా, హైదరాబాద్"** వారు సాదరంగా ఆమోదిస్తూ డి.టి.పి. చేయడానికి ఆవశ్యకమైన వ్యయాన్ని భరించారు. ఆ సభసభ్యులందఱికీ దాసుడు చాలా కృతజ్ఞుడు. అన్ని వ్యాఖ్యలను ఒక చోట చేర్చడంవల్ల గ్రంథపరిమితి విస్తరించింది. దీనిని ముద్రించే వారు ఎవరుంటారు? అని ఆలోచించే సమయంలో అస్మచ్ఛ్రేయోభిలాషులు, **శాస్త్రరత్నాకర, ఉ.వే.శ్రీమాన్.డా. సముద్రాల రంగరామానుజాచార్యస్వామివారు,** (అధ్యక్షులు, ఉభయవేదాంతాచార్యపీఠం) నా ప్రయత్నాన్ని చూచి చాలా సంతోషించి, ప్రోత్సహిస్తూ, **పరమహంసపరివ్రాజకాచార్యులు, శ్రీశ్రీశ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి** వారిద్వారా ప్రకటించే ప్రయత్నం చేయవచ్చునని అనడమే కాక, శ్రీజీయర్‌స్వామివారితో తాము స్వయంగా ఈ విషయాన్ని గూర్చి ప్రస్తావించారు. శ్రీజీయర్‌స్వామివారు వెంటనే ఎంతో ఔదార్యంతో, వాత్సల్యంతో ఈ గ్రంథాన్ని తాము ముద్రిస్తామని మాట ఇచ్చారు. ఇంతకుముందే **"తిరువెళ్ళుకూర్ఱ్ఱిరుక్కై"** – సవ్యాఖ్యానంగా శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి శతాబ్ది మహోత్సవస్మారకంగా తాము ప్రచురింప దలచిన శతాధిక గ్రంథాలలో ఒకటిగా ముద్రించడమే కాక, ఈ గ్రంథాన్ని కూడా ఆ పథకంలోకి చేర్చి, ముద్రించడం శ్రీస్వామివారి హృదయవైశాల్యానికి తార్కాణం. ఈ మహనీయు లిద్దఱి సన్నిధిలో దాసుడు **"తలైయల్లాల్ కైమ్మాఱిలేన్"** అనే రీతిలో కార్తజ్ఞ్య పూర్వకంగా, సవినయంగా ప్రణమిల్లడం తప్ప వేఱే ప్రతికృతి ఏమున్నది? దాసుని ఈ ప్రయత్నాన్ని ఆమోదించి, సర్వధా, సర్వదా ప్రోత్సహించే ఆచార్యులు, పితృపాదులు, **న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి** దివ్యసన్నిధిలో పునఃపునః ప్రణామాలను అర్పిస్తున్నాను. దివ్యార్థ దీపికను ఆంధ్రీకరణతో పాటు తెలుగు అక్షరాలతో ముద్రించడానికి అనుమతించిన సహృదయులు, శ్రీ కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వారి కుమారులు, **ఉ.వే. శ్రీమాన్ శెల్వమణి స్వామివారి** సన్నిధిలో, పౌత్రులు **ఉ.వే. శ్రీమాన్ పి.బి. రాజహంసం స్వామివారి** సన్నిధిలో కృతజ్ఞతా పూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. ఈ వ్యాఖ్య ప్రధానంగా సుదర్శన (తమిళ) మాసపత్రికా సంపాదకులు, **ఉ.వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారి** తమిళవివరణాన్ని ఆధారంగా చేసుకొని వ్రాయబడింది. తమ తమిళవ్యాఖ్యను ఉపయోగించుకొనే అవకాశాన్ని ప్రసాదించిన సహృదయులు **ఉ.వే. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారికి** నేను బహుధా కృతజ్ఞుడను. వారి సన్నిధిలో కార్తజ్ఞ్యపురస్సరంగా అభివందనం చేస్తున్నాను. ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసి సహాయపడిన మిత్రులు శ్రీ చంద్రశేఖర్ గారికి, కుమారి ప్రశాంతి గారికి నా ఆశీస్సులు. అల్పజ్ఞాని అయిన దాసుడు ఈ ప్రయత్నం చేయడం సాహసమే అయినా, **"సంబంధాత్ స్వాత్మలాభః"** అనే రీతిలో ఆత్మోజ్జీవనాన్ని పొందాలనే పేరాశతోనే ఈ ప్రయతాన్ని చేశాను. ఈ ఏడు పెరియవాచ్చాన్ పిళ్ళై అవతారసంవత్సరం కావడంవల్ల కూడా ఈగ్రంథముద్రణ సందర్భోచితం అని భావిస్తాను. ఇందులోని గుణదోషా



లను నిర్ణయించడానికి సిద్ధంగా ఉన్న సహృదయులైన పెద్దల, విజ్ఞుల, భాగవతుల సన్నిధిలో సవినయంగా సేవిస్తూ, గ్రంథాన్ని సమర్పిస్తూ, సెలవు తీసికొంటున్నాను.

**అరుణ్ మికుత్త దొరువడివాయ్ క్కచ్చితన్నిల్**
**ఐప్పశి మాతత్తిరువోణత్తునాళిల్**
**పొరుణ్ మికుత్త మఱై విళఙ్గ ప్పువియో రుయ్య**
**ప్పొయ్‌కైతనిల్ వన్దుదిత్త పునిదామన్నాళ్**
**ఇరుళదనిర్ఱ్ణ్ కోవలిడైకళ్ళిచ్చె –**
**న్ఱిరువరుడ నిఱ్కవుమా లిడైనెరుక్క**
**త్తిరువిళక్కు మెనుమ్ వైయన్దకళి నూఱుమ్**
**శెళ్ళుమ్ పొరుళా ఎనక్కరుళ్ శెయ్‌దిరున్ద నీయే**

**( ప్రబంధసారం – వేదాంత దేశికులు )**

**వరవరమునిశతకము**

(సారమైన అర్థాలు నిండి ఉన్న వేదం లోకంలో ప్రకాశించేటట్లు, లోకంలోని వారు ఉజ్జీవించేటట్లు అల్పిశిమాసం శ్రవణానక్షత్రంలో కాంచీపురంలోని తామరకొలనులో చేతనుల విషయంలోగల గొప్ప కరుణమూర్తీభవించిందని చెప్పే రీతిలో వచ్చి అవతరించిన పుణ్యస్వరూపా! సరోయోగీ! పూర్వం ఒకానొక దినంలోని రాత్రివేళ చల్లని తిరుక్కోవలూర్ లోని ఒక ఇంటి దేహళిలో మీరు, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు అనే ఇద్దఱు దివ్యసూరులతో కలసి ఉన్నపుడు శ్రియఃపతివచ్చి మిమ్ములను సమ్మర్దించగా, మీరు పల్కిన చీకటిని పోగొట్టే గొప్పదీపం అనదగిన "వైయమ్ తకళి" అని ప్రారంభమయ్యే నూఱు పాశురాలతో కూడిన ముదల్ తిరువన్దాది ప్రబంధాన్ని గొప్ప సంపదగా మీరు నాకు అనుగ్రహించాలి.

తిరుపతి, భాగవతవిధేయుడు
15-8-07 **ఈ.ఏ. శింగరాచార్యులు**

# పొయ్‌కై యాళ్వార్ తనియన్ శ్లోకాలు

**తులాయాం శ్రవణే జ  లీబీఖీతం కాంచ్యాం కాంచనవారిజాత్ ।**
**ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే ॥**

(ద్వాపరయుగంలో కాంచీనగరం తిరువె⁚.కాక్షేత్రంలోని సరస్సులో పూచిన బంగారు తామర నుండి అల్పిశిమాసం శ్రవణానక్షత్రంలో పాంచజన్యాంశంవల్ల అవతరించిన సరోయోగిని ఆశ్రయిస్తున్నాను.)

**కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినమ్ ।**
**కలయే యః శ్రియఃపత్యై రవిం దీప మకల్పయత్ ॥**

(కంచిలోని ఒక సరస్సులో పూచిన బంగారుతామరలో అవతరించినవారు, శ్రీమన్నారాయణునకు సూర్యుని దీపంగా చేసినవారు అయిన సరోయోగిని భావిస్తున్నాను.)

**ముకుందస్య ముఖోల్లాస మూలవాగ్జాలమూర్ఛితమ్ ।**
**మునిముఖ్యం సరోజాతం ముక్తిమూల ముపాస్మహే ॥**

(ముకుందునకు ముఖానందం కల్గించే పాశురాలను పాడి, మూర్ఛిల్లినవారు, ఆళ్వార్లలో ప్రథములు, ముక్తికి మూలమైనవారు అయిన సరోయోగిని ఉపాసిస్తున్నాను.)

**అజ్ఞాధీశ్రీచందనే ద్వాపరాఖ్యే**
**సిద్ధార్థ్యాఖ్యే వత్సరే మాసి శ్రేష్ఠే ।**
**శుక్లాష్టమ్యాం భౌమవారే శుభర్క్షే**
**విష్ణో ర్జన్మ ప్రాప కాసారయోగీ ॥**

సరోయోగి ద్వాపరయుగంలో **"ఆజ్ఞాధీశ్రీచందన"** అనే అక్షరాలచే సంకేతాత్మకంగా నిర్దేశింపబడ్డ 862 900 సంవత్సరాలు గడచిన తర్వాత సిద్ధార్థి సంవత్సరం అల్పిశిమాసంలో శుక్లపక్ష అష్టమి తిథిలో మంగళవారంలో అవతరించారు.

**హేమాబ్జిని హేమసరోజగర్భాత్**
**శ్రీపాంచజన్యోఽజని తత్ర యోగీ ।**
**తారే హరే రాశ్వయుజాఖ్యమాసే**
**సమస్తజీవావనకర్మహేతోః ॥      (దివ్యసూరిచరితమ్-2-10)**



పరమపురుషుని ఆయుధాలతో ఒకటి అయిన పాంచజన్యం సకలజీవులను రక్షించడం కోసం అల్పిశిమాసంలో విష్ణువుయొక్క నక్షత్రం అయిన శ్రవణంలో బంగారు తామరపూవు నుండి సరోయోగిగా అవతరించింది.

# పొయ్‌కై యాళ్వార్ వాళ్ళిత్తిరునామము

**శెయ్య తులావోణత్తి ల్జెకత్తుదిత్తాన్ వాళ్ళియే**
**తిరుక్కచ్చిమానకరమ్ శెళిక్క వన్దోన్ వాళ్ళియే**
**వైయన్దకళి నూఱుమ్ వకుత్తురైత్తాన్ వాళ్ళియే**
**వనశమలర్క్కరువదనిల్ వళర్న్దమైన్దాన్ వాళ్ళియే**
**వెయ్యకదిరోన్‌తన్నై విళక్కిట్టాన్ వాళ్ళియే**
**వేఙ్గడవర్ తిరుమలైయై విరుమ్బుమవన్ వాళ్ళియే**
**పొయ్‌కైముని వడివళ్ళకుమ్ పొఱ్పదముమ్ వాళ్ళియే**
**పొన్‌ముడియుమ్ తిరుముకముమ్ ఇప్పూదతలత్తిల్ వాళ్ళియే**

అందమైన తులామాసంలోని శ్రవణానక్షత్రంలో అవతరించినవారు వర్ధిల్లాలి. కాంచీనగరం వర్ధిల్లేటట్లు అవతరించినవారు వర్ధిల్లాలి. **"వైయమ్ తకళి"** అని ప్రారంభంలోని నూఱు పాశురాలను కూర్చినవారు వర్ధిల్లాలి. తామరపూవును గర్భవాసంగా కల్గినవారు వర్ధిల్లాలి. సూర్యుని దీపంగా వెల్గించినవారు వర్ధిల్లాలి. వేంకటేశ్వరుని కొండను అభిమానించేవారు వర్ధిల్లాలి. సరోయోగి రూపసౌందర్యం, బంగారు పాదాలు వర్ధిల్లాలి. వారి బంగారు కిరీటం, శ్రీముఖం ఈ భూమిలో వర్ధిల్లాలి.

# ముదలాళ్వార్ల వైభవం

## ( దివ్యార్థదీపికా )

ఆళ్వార్కళనైవర్క్కుమ్ మున్నే ఇన్ద ఉలకిరుళ్ నీఙ్గన వన్దుదిత్తు "అన్దమిళ్లాల్ నఱ్కలైకళ్ అయ్న్దురైత్త" పొయ్కైయార్, పూదత్తార్, పేయార్ ఎన్ను మిమ్మూవరుమ్ ముదలాళ్వార్ కళెన్ఱు ప్రసిద్ధి పెఱ్ఱిరుప్పర్. "మఱ్ఱుళ్ళ ఆళ్వార్కళుక్కు మున్నే వన్దుదిత్తు నఱ్ఱమిళ్లాల్ నూల్శెయ్దు నాట్టైయుయ్త్తు పెఱ్ఱిమైయోరెన్ఱు ముదలాళ్వార్ కళెన్నుమ్ పెయర్ ఇవర్క్కు నిన్ఱదులకత్తే నికళ్న్దు" ఎన్ఱ ఉపదేశరత్తిన మాలైప్పాశురమ్ నోక్కత్తక్కదు.

విభవత్తిల్ ఇమ్మూవరుమ్ భగవత్కటాక్షమ్ పెఱ్ఱపిన్నర్ ఒరువరై యొరువర్ విట్టుప్పిరియామల్ ఒన్ఱుకూడియే వాళ్న్దదు పఱ్ఱి అర్చావతారత్తిరుక్కోయిల్కళెఙ్గుమ్ ఇమ్మూవరుమ్ ఒన్ఱు శేర్న్దే కోయిల్కొణ్డిరుప్పార్కళ్. అప్పడియే ఇవర్కళిన్ వైభవముమ్ ఒన్ఱుశేర్న్దే అనుసంధిక్కప్పడుమ్. ఇమ్మూవరుక్కుమ్ తిరునాళ్పాట్టు అరుళిచ్చెయ్యానిన్ఱ శ్రీమణవాళమామునికళుమ్ "ఐప్పశియి లోణ మవిట్టమ్ శదైయ మివై ఒప్పిలవానాళ్కళుల కత్తీర్ ఎప్పువియుమ్ పేశు పుకళ్ ప్పొయ్కైయార్ పూదత్తార్ పేయాళ్వార్ తేశుడనే తోన్ఱు శిఱప్పాల్" ఎన్ఱు ఒరే పాశురమాక త్తొకుత్తు అరుళిచ్చెయ్దమైయుమ్ నోక్కతక్కదు.

### పొయ్కైయాళ్వార్

"తెణ్ణీర్ వయల్ తొణ్డై నన్నాడు శాన్ఱోరుడైత్తు" ఎన్ఱు ఒవైయార్ పాడియపడి, కల్వి, కేళ్వి, అఱివు, ఒళుక్కఙ్గళా లాన్ఱవర్ పలరైయు ముడైయదాన తొణ్డైనన్నాట్టిలే పుణ్యక్షేత్రఙ్గళెల్లా వఱ్ఱిలుళ్ళుమ్ మిక్క శీర్మై పెఱ్ఱు విళఙ్గుమ్ సత్యవ్రతక్షేత్రత్తిలే "ముత్తి తరుమ్ నకరేళ్లిల్ ముక్కియమామ్ కచ్చి" ఎన్నుమ్, "కాశి ముదలాకియ నన్నకరి యెల్లామ్ కార్మేనియరుళాళర్ కచ్చిక్కు ఒవ్వా" ఎన్ఱుమ్ శిఱప్పిత్తు క్కూఱప్పడువదుమ్, వేకవతి యెన్నుమ్ పుణ్ణియనదియన్ తెన్పాల్ విళఙ్గువదుమాన కాంచిమానకరిల్ శ్రీయథోక్తకారిసన్నిధి ఎన్ఱు ప్రసిద్ధమాన తిరువె.ॅ.కా వెన్నుమ్ దివ్యతలత్తిన్ వడపుఱత్తిల్ మహాన్కళదు తిరువుళ్ళమ్పోల్ ఆళ్న్దు, తెళిన్దు విళఙ్గుమ్ పొఱ్ఱామరైప్పొయ్కైయిలే పూత్తదొరు నఱ్ఱామరైప్పూవిలే ఐప్పశిమాతత్తు త్తిరువోణత్తిలే ఒరువర్ తిరువవతరిత్తార్. ఇవరుడైయ ప్రభావత్తై ప్పార్త్తు అనైవరుమ్ ఇవరై తేవిట్చిఱన్ద తిరుమాలిన్ దివ్యాయుధఙ్గళుళ్ పాంచజన్యమెన్నుమ్ తిరుచ్చఙ్గిన్ అంశమాక అఱుదియిట్టిరున్దనర్. పొయ్కైయిలే అవతరిత్తతు కారణమాక ప్పొయ్కైయాళ్వారెన్ఱు తిరునామమ్ పెఱ్ఱారివర్.



### పూదత్తాళ్వార్

నీర్వళమ్, నిలవళమ్ ముదలియ పల వళఙ్గళుమ్ మలిన్దు, ఇప్పూమణ్డలత్తిఱ్కు త్తిలకమ్ పోన్ఱుళ్ళ అత్తొణ్డైమణ్డలత్తిలే కీళ్కడఱ్కరైయిలుళ్ళ తిరుక్కడల్మల్లై యెన్గిఱ మహాబలిపురత్తిలే కురుక్కత్తిప్పన్దరిలే ఒరు కురుక్కత్తి త్తిరుమలరిలే ఇప్పశిమాదత్తు అవిట్టనక్షత్తిరత్తిలే ఒరువర్ తిరువవతరిత్తార్. ఇవరుడైయ వైభవత్తై నోక్కి అనైవరుమ్ ఇవరై క్కౌమోదకి ఎన్నుమ్ గదాయుధత్తిన్ అంశమాక అఱుదియిట్టిరున్దనర్. ఇవర్క్కు ప్పూదత్తాళ్వారెన్ఱు తిరునామమానపడి యెన్నెన్నిల్, వడమొళ్లియిల్ "భూ-సత్తాయామ్" ఎన్గిఱదుతు వడియాక ప్పిఱన్దదు "భూతమ్" ఎన్నుమ్శొల్ సత్తై పెఱ్ఱతు ఎన్ఱు పొరుళ్. ఎమ్బెరుమానుడైయ తిరుక్కుణఙ్గళై యనుబవిత్తు సత్తై ప్పెఱ్ఱారెన్నుమ్ కారణమ్ పఱ్ఱి ప్పూదత్తాళ్వారెన్ఱు తిరునామమాయిఱ్ఱెన్ఱుణర్క. తిరువాయ్మొళ్లియిల్ (5-2-1) "కడల్వణ్ణన్ పూతమ్" ఎన్ఱవిడత్తు వియాక్కియానఙ్గళిల్ ఇప్పొరుళ్ విళఙ్గ క్కాణ్గ.

### పేయాళ్వార్

"ఆఱోడీరెట్టు త్తొణ్డై" ఎన్దవాఱు నూత్తెట్టుత్తిరుప్పతికళుళ్ ఇరుపత్తిరణ్డు తిరుప్పతికళై యుడైయదాన తుణ్డీరమణ్డల మెన్గిఱ అత్తొణ్డైవళనాట్టిలే తిరువల్లిక్కేణి యెన్నుమ్ దివ్యదేశత్తుక్కు త్తెన్దిశైయిలుళ్ళ ప్పూవిలే ఐప్పశి మాదత్తు చ్చదయనక్షత్రత్తిలే ఒరువర్ తిరువవతారమ్ శెయ్దరుళినర్. ఇవరుడైయ వైభవత్తై క్కణ్డు పలరుమ్ ఇవరై నన్దకమెన్నుమ్ వాట్పడైయిన్ అంశమాక అయిదియిట్టనర్. ఇవర్ ఒప్పుయర్వఱ్ఱ భగవద్భక్తియైయుడైయరాయ్, కణ్డవర్ కళడఙ్గలుమ్ "ఇవర్ పేయ్ పిడిత్తవర్" ఎన్నుమ్బడి నెఞ్జళ్లిన్దు, కణ్ శుళ్లన్ఱు, అళ్లుదుమ్, శిరిత్తుమ్, తొళ్లుదుమెళ్లున్దాడియుమ్, మకిళ్న్దు పాడియుమ్, అలఱియుమే అనవరతమ్ పోదుపోక్కిక్కొణ్డిరున్దమైయాల్ పేయాళ్వారెన్ఱు తిరునామమ్ పెఱ్ఱనర్. పరభక్తి తలైయెడుత్తు ఎమ్బెరుమానై యనుభవిక్కుమ్ తిఱమ్ మఱ్ఱ యాళ్వార్కళిఱ్కాట్టిల్ ఇవర్క్కు మిక ప్పెరిదా యిరున్దదనాలుమ్, ఇవర్తామ్ ఎమ్బిరానుక్కు అట్పదు మాత్తిరమేయన్ఱి త్తిరుమళ్లిశై యాళ్వారై త్తిరుత్తి ప్పణికొణ్డ మహానాదలాలుమ్ మహదాహ్వయర్ ఎన్ఱ మఱ్ఱొరు తిరునామముమ్ ఇవర్క్కు ఉణ్డు.

### ఇవర్కళిన్ వైభవమ్

శ్రీరామ-భరత-లక్ష్మణర్ పోల అడుత్తడుత్తనాళ్కళిల్ అవతరిత్తవర్కళుమ్, అయోనిజర్కళుమాకియ ఇమ్మూవర్క్కుమ్ శ్రీ వైకుంఠనాథనుడైయ తిరువాణైయినాల్ సేనైముదలియార్ ఇన్నిలత్తిఱ్కెళ్లున్దరుళి ప్పఞ్చసంస్కారఙ్గళై చ్చెయ్దు త్తిరుమన్దిరప్పొరుళ్ కళైయుమ్ ఉపదేశిత్తరుళినర్. అదనాల్, ఇవర్కళ్ "ముక్కుణత్తి లిరణ్డవై యకఱ్ఱి ఒన్ఱిని లొన్ఱి నిన్ఱు" ఎన్ఱాఱ్పోల రజోగుణముమ్, తమోగుణముమ్ శిఱిదు మఱ్ఱు,

శుద్ధసాత్త్వికర్కళాయ్, ఎమ్బెరుమానుక్కుమ్ కైంకర్యమ్ శెయ్వదైయే పెఱుమ్ పేఱాక క్కొణ్డు, జ్ఞాన - భక్తి - విరక్తికళుక్కు ప్పిఱప్పిడమెన్నలామ్బడి విళఙ్గి, "ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయు మెల్లామ్ కణ్ణన్" ఎన్ఱాఱ్పోల భగవద్గుణానుభవత్తైయే ధారకముమ్, పోషకముమ్, భోగ్యముమాక క్కొణ్డు, అన్నపానాదికళై యొழிత్తు, "ఉణ్డియే ఉడైయే ఉకన్దోడు" కిన్ఱ ఇమ్మణ్డలత్తారోడు కూడకిల్లామల్ ఒరునాళిరున్దవిడత్తిల్ మఱ్ఱొరునాళిరాదపడి "ఓడి త్తిరియుమ్ యోకికళాయ్" తమ్మిల్ ఒరువరై యొరువర్ అఱియామల్ తనిత్తనియే సంచరితుక్కొణ్డిరున్దనర్.

ఇప్పడి సంచరిత్తుక్కొణ్డిరున్ద ఇమ్మూవరైయుమ్ ఓరిడత్తిలే శేర్త్తు ఆట్కొణ్డు ఇవర్కళ్ మూలమాక ఉలకత్తై వాழ்విక్కవేణు మెన్గిఱ కుతూహలమ్ ఎమ్బెరుమాన్ తిరువుళ్ళత్తి లుణ్డాయిఱ్ఱు.

సత్యకామనాయ్, సత్యసంకల్పనాన ఎమ్బెరుమానుడైయ మనోరథమ్ పழுదు పడుమో! అవనుడైయ తిరువుళ్ళమ్ నిఱైవేఱువదఱ్కు వழி యుణ్డాయిఱ్ఱు. అదావదు- ఒరునాళ్ సూర్యన్ అస్తమిత్తపిన్బు పొయ్కైయాழ்వార్ తిరుక్కోవలూరై యడైన్దు, అఙ్గు మృకణ్డుమహర్షియిన్ తిరుమాళికైయిత్ప్రేన్ఱు, అదన్ ఇడైకழிయిఱ్పళ్ళికొణ్డిరున్దార్. పిఱకు, పూదత్తாழ்వారుమ్ అఙ్గే వన్దు శేర, "వైష్ణవో వైష్ణవం దృష్ట్వా దండవ త్ప్రణమేత్ భువి" ఎన్గిఱ శాస్త్రముఱైప్పడి ఒరువరై ఒరువర్ వన్దనై వழிపాడుకళ్ శెయ్దవుడన్, "ఇవ్విడమ్ ఒరువర్ పడుక్కలామ్; ఇరువర్ ఉట్కార్న్దిరుక్కలామ్" ఎన్ఱు పొయ్కై యాழ்వార్ విణ్ణప్పమ్ శెయ్య, అవ్విడమే ఇరువరుమ్ అఙ్గు ఉట్కార్న్దిరున్దనర్. అదన్పిఱకు, పేయాழ்వారుమ్ అవిడత్తిఱ్కే వన్దు శేర, ఒరువరై యొరువర్ తణ్డన్ సమర్ప్పిత్తు ఉపచరిత్తు క్కొణ్డపిన్, "ఇవ్విడమ్ ఒరువర్ పడుక్కలామ్; ఇరువర్ ఇరుక్కలామ్; మూవర్ నిఱ్కలామ్" ఎన్ఱు పొయ్కై పూదత్తారిరువరుమ్ శొల్ల, అవ్విదమే మూవరుమ్ అవ్విడత్తిలే నిన్ఱు కొణ్డు, పరస్పరమ్ భగవద్గుణఙ్గళై చ్చొల్లువదుమ్, కేట్టలుమ్ శెయ్దు కళిత్తిరున్దనర్.

అప్పొழுదు ఉలకళన్దమూర్త్తి అవర్కళ్తిఱత్తిల్ తిరువరుళ్శెయ్యుమ్ పొరుట్టు ప్పెరుత్త ఇరుళైయుమ్, కనత్త మழைయైయు ముణ్డాక్కి, పెరియవడివత్తోడు అవర్కళిడైయే శెన్ఱు నిన్ఱు, పొఱుక్కముడియాద మిక్క నెరుక్కత్తై చ్చెయ్దరుళినాన్. అదన్మేల్ ఇవర్కళ్, "ఇదువరైయిలుమ్ ఇల్లాద నెరుక్కమ్ ఇప్పోదు ఉణ్డానదుక్కు కారణ మెన్కొల్? పిఱరెవరేనుమ్ ఇఙ్గు వన్దు పుకున్దవరుణ్డో?" ఎన్ఱు శఙ్కిక్కైయిల్ పొయ్కైయాழ்వార్ పూమి యాకియ తకழிయిల్ కడల్ నీరైయే నెయ్యాక క్కొణ్డు సూర్యనై విళక్కాక ఏఱ్ఱ, పూదత్తாழ்వార్ అన్బాకియ తకழிయిల్ ఆర్వత్తై నెయ్యాక, శిన్దైయై త్తిరియాకవుమ్ కొణ్డు ఞానదీపత్తై ఏఱ్ఱ, ఇవ్విరణ్డి నొళియాలుమ్ ఇరుళఱ్ఱదనాల్, పేయాழ்వార్



ఎమ్బెరుమానై త్తామ్ సేవిత్తమై కూఱియవళవిలే, మూవరుమ్ భగవత్స్వరూపత్తై నన్గఱిన్దు అనుభవిత్తు ఆనన్దప్పెరువెళ్ళ మెయ్ది, అదనుక్కு పోక్కువీడాక ప్పిరవన్దఙ్గళ్ అరుళిచ్చెయ్దు ఉలకత్తారై ఉయ్విక్క త్తిరువుళ్ళమ్ పఱ్ఱినార్.

అప్పొழுదు పొయ్కైయాழ்వార్ "వైయమ్ తకళియా" ఎన్ఱు తొడఙ్గియుమ్, పూదత్తாழ்వార్ "అన్బే తకళియా" ఎన్ఱు తొడఙ్గియుమ్, పేయాழ்వార్ "తిరుక్కణ్డేన్" ఎన్ఱు తొడఙ్గియుమ్ మూవరుమ్ మూన్ఱు తిరువన్దాదిప్పిరవన్దఙ్గళై త్తిరువాయ్మలర్న్దరుళినార్. ఇప్పిరపన్దఙ్గట్కు అడైవే, ముదల్తిరువన్దాది యెన్ఱుమ్, ఇరణ్డాన్తిరువన్దాది యెన్ఱుమ్, మూన్ఱామ్ తిరువన్దాది యెన్ఱుమ్ తిరునామమ్ వழఙ్గలాయిఱ్ఱు.

పిన్బు ఇవ్వాழ்వార్కళ్ మూవరుమ్ దేహళీశ యెన్నుమ్ తిరుక్కోవలూరాయనారై త్తిరువడి తొழுదు విడై పెఱ్ఱు, నెడుఙ్గాలమ్ తిరుప్పతికళ్ తోఱుమ్ శెన్ఱు, మఙ్గళాశాసనమ్ శెయ్దు, యోగబలత్తాల్ ఆయిరక్కణక్కాన వరుషఙ్గళ్ ఇమ్మణ్ణులకిల్ వాழ்న్దిరున్దు వైయకత్తై వాழ்విత్తరుళినార్.

ముదలాழ்వార్ తిరువడికళే శరణమ్.

## దివ్యార్థదీపిక అనువాదం

ఆళ్వార్ల అందరిలోను ముందుగా ఈ లోకంలోని అజ్ఞానం పోవడంకోసం వచ్చి అవతరించి, అందమైన తమిళంలో చక్కని వేదాలను పరిశీలించి అనుగ్రహించిన పొయ్కైయాళ్వార్లు, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు అనే ఈ ముగ్గురు ముదలాళ్వార్లు అని ప్రసిద్ధిని పొందారు. **"మఱ్ఱుళ్ళ ఆழ்వార్కళుక్కు మున్నే వన్దుదిత్తు నఱ్ఱమిழாల్ నూల్ శెయ్దు నాట్టైయుయ్త్త పెఱ్ఱిమైయోరెన్ఱు ముదలాழ்వార్కళెన్నుమ్ పెయరివర్క్కు నిన్ఱదులకత్తే నికழ்న్దు"** అనే ఉపదేశరత్తినమాలై పాశురం గమనించతగినది.

విభవంలో (ఈ విభూతిలో) ఈ ముగ్గురు భగవానుని కటాక్షాన్ని పొందిన తరువాత ఒకరిని విడచి వేఱొకరు ఉండలేక, ఒకటిగా కలిసే జీవించినందువల్ల అర్చావతార సన్నిధులలో అంతటా ఈ ముగ్గురూ ఒకటిగా చేరే వేంచేసి ఉంటారు. ఆ విధంలోనే వీరి వైభవంకూడా ఒకటిగా చేర్చే అనుసంధింపబడుతుంది. ఈ ముగ్గురికి తిరునాళ్పాట్టును అనుగ్రహించే శ్రీమణవాళమహామునులుకూడా – "ఐప్పశియిలోణ మవిట్టమ్ శదైయ మివై ఒప్పిలవానాళ్కళులకత్తీర్ – **ఎప్పువియుమ్ పేశుకழ் పొయ్కైయార్ పూదత్తార్ పేయాழ் వార్ తేశుడనే తోన్ఱు శిఱప్పాల్"** అని ఒకే పాశురంగాకూర్చి అనుగ్రహించడం గమనించ తగినది.

## పొయ్‌కై యాళ్వార్లు

**"తెణ్ణీర్‌వయల్ తొణ్డైనన్నాడు శాన్ఱోరుడైత్తు"** (స్వచ్ఛమైన జలాన్ని, సస్యక్షేత్రాలను కల తొణ్డై మండలం విద్వాంసులను కల్గినది) అని ఒవైయార్ పాడిన రీతిలో, విద్య, విలాస, జ్ఞాన, శీలాలనుకల పండితులు పలువురను కల్గినదైన తొణ్డైమండలంలోని పుణ్యక్షేత్రాలు అన్నిటిలోను మిక్కిలి గొప్పతనాన్ని కల్గి వెలిగే సత్యవ్రతక్షేత్రంలో **"ముత్తి తరుమ్ నకరేళ్ళిల్ ముక్కియమామ్ కచ్చి"** (ముక్తిదాయకాలైన ఏడు నగరాల్లో కాంచీనగరం ముఖ్యమైనది) అని, **"కాశి ముదలాకియ నన్నకరియెల్లామ్ కార్‌మేని యరుళాళర్ కచ్చిక్కు ఒవ్వా"** (కాశి మొదలైన గొప్ప నగరాలు అన్నీ మేఘరూపుడైన వరదరాజస్వామి వేంచేసి ఉన్న కంచికి సాటి కావు) అని కీర్తిస్తూ చెప్పబడేది, వేగవతి అనే పుణ్యనది దక్షిణ దిక్కులో ప్రకాశించేది అయిన కాంచీమహానగరంలో శ్రీయథోక్తకారి సన్నిధి అనే ప్రసిద్ధం అయిన **"తిరువె.˙.కా"** దివ్యస్థలానికి ఉత్తరంవైపు మహాత్ముల మనస్సువలె గంభీరంగా, స్వచ్ఛంగా వెలిగే బంగారు తామరల సరస్సులో పూచిన ఒకచక్కని తామరపువ్వులో అల్పిశిమాసం శ్రవణా నక్షత్రంలో ఒకరు ఆవిర్భవించారు. వీరి వైభవాన్ని చూచి అందఱూ వీరిని దైవాలన్నిటిలోని గొప్పదైవం అయిన లక్ష్మీపతియొక్క దివ్యాయుధాలలో పాంచ జన్యం అనే శంఖంయొక్క అంశగా నిశ్చయించారు. సరస్సులో అవతరించిన కారణంగా పొయ్‌కై యాళ్వార్ అనే తిరునామాన్ని పొందారు వీరు.

## పూదత్తాళ్వార్

నీటిసమృద్ధి, భూసారం మొదలైన పలు సారాలతో సమృద్ధమై, ఈ భూమండలానికి తిలకంవలె ఉన్న తొణ్డై మండలంలోని తూర్పుసముద్రతీరాన ఉన్న **"తిరుక్కడల్ మల్లై"** అనే మహాబలిపురంలో బండిగురివింద పందిరిలోని ఒక బండిగురివింద పూవులో అల్పిశిమాసం ధనిష్ఠా నక్షత్రంలో ఒకరు అవతరించారు. వీరి వైభవాన్ని తలచి అందఱూ వీరిని కౌమోదకి అనే ఆయుధంయొక్క అంశగా నిశ్చయించారు. వీరికి పూదత్తాళ్వార్లు అనే పేరు వచ్చిన తీరు ఏమి? అని అంటే, సంస్కృతంలో – **"భూ–సత్తాయామ్"** అనే ధాతువు మూలంగా పుట్టిన **"భూతమ్"** అనే పదానికి సత్తను పొందింది – అనే అర్థం. భగవానుని కల్యాణగుణాలను అనుభవించే సత్తను పొందారు అనే కారణాన్నిబట్టి పూదత్తాళ్వార్ అనే తిరునామం వీరికి కల్గింది- అని తెలియాలి. తిరువాయ్‌మొళ్ళిలోని (5-2-1) **"కడల్‌వణ్ణన్ పూతమ్"** అనేచోట వ్యాఖ్యానంలో ఈ అర్థం వ్యక్తంకావడాన్ని చూడండి.

## పేయాళ్వార్

**"ఆఱోడీరెట్టు తొణ్డై"** (ఆఱుతో రెండు ఎనిమిదులు) అనే రీతిలో నూటఎనిమిది దివ్యతిరుపతులలో ఇరవై రెండు తిరుపతులను కల్గినదైన తుణ్డీరమండలం అనే తొణ్డై



మండలంలో తిరువల్లిక్కేణి అనే దివ్యదేశానికి దక్షిణదిశలోఉన్న తిరుమయిలైనగరం (మయూరపురిలో) లోని ఒకబావిలో పూచిన ఎఱ్ఱకలువ పూవులో అల్పిశిమాసం శతభిషం నక్షత్రంలో ఒక అవతరించారు. వీరి వైభవాన్ని చూచి పలువురు వీరిని నందకం అనే ఖడ్గాయుధంయొక్క అంశగా నిశ్చయించారు. వీరు నిస్సమాభ్యధికం అయిన భగవద్భక్తిని కలవారై, చూచినవారందఱు "వీరు పిశాచగ్రస్తులు" అనేటట్లు మనస్సు శిథిలమై, కన్నులు తిరిగి, రోదిస్తూ, నవ్వుతూ, నమస్కరిస్తూ, లేచి నాట్యంచేస్తూ, ఆనందించి పాడి, తిరుగుతూ నిత్యం పొద్దు పుచ్చుతున్నందున పేయాళ్వార్ అనే పేరు పొందారు. పరభక్తి ఉద్బుద్ధమై, భగవానుని అనుభవించే సామర్థ్యం మిగిలిన ఆళ్వార్లకంటే వీరికి మిక్కిలి గొప్పగా ఉన్నందువల్ల, వీరు భగవానునకు దాసులు కావడమే కాకుండా, తిరుమళ్ళిశైయాళ్వార్లను సంస్కరించి, దాసులుగా చేసిన మహానుభావులు కావడంవల్ల మహదాహ్వాయులనే వేఱొక పేరుకూడా వీరికి ఉన్నది.

## వీరి వైభవం

శ్రీరామ–భరత–లక్ష్మణులవలె ఉత్తరోత్తరనక్షత్రాలలో అవతరించినవారు, అయోనిజులును అయిన ఈ ముగ్గురికీ శ్రీవైకుఠనాథుని ఆజ్ఞతో విష్వక్సేనులు ఈ లోకానికి వేంచేసి, పంచసంస్కారాలను చేసి, తిరుమంత్రార్థాన్నికూడా ఉపదేశించారు. అందువల్ల వీరు **"ముక్కుణ విరణ్డవై యకఱ్ఱి ఒన్ఱిలొన్ఱినృ"** అనే రీతిలో రజోగుణం, తమోగుణం కొంచెంకూడా లేకుండా శుద్ధసాత్త్వికులై, భగవానునకు కైంకర్యం చేయడమే గొప్పఫలంగా గ్రహించి, జ్ఞానభక్తివైరాగ్యాలకు ఆకరం అనేటట్లు వెలిగి, **"ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్‌వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** అనే రీతిలో భగవద్గుణానుభవాన్నే ధారక, పోషక, భోగ్యాలు గ్రహించి, అన్నపానాదులను విడచి, **"ఉణ్డియే ఉడైయే ఉకన్దోడుమ్"** అని తిని, వస్త్రధారణచేసి, సంతోషించి తిరిగే ఈ భూమిలోనివారితో కలసి ఉండలేక, ఒకనాడున్న చోట వేఱొకనాడు ఉండని రీతిలో **"ఓడి త్తిరియుమ్ యోకికళ్"**గా తమలో ఒకరిని వేఱొకరు తెలియకుండా ప్రత్యేక ప్రత్యేకంగా సంచరిస్తూ ఉన్నారు.

ఈవిధంగా సంచరించే వీరిని ముగ్గురినీ ఒకచోట చేర్చి, తనకు శేషంగా చేసికొని, వీరిద్వారా లోకాన్ని ఉద్ధరించాలనే ఆశ భగవానుని మనస్సులో కల్గింది.

సత్యకాముడు, సత్యసంకల్పుడూ అయిన భగవానుని మనోరథం వ్యర్థం అవుతుందా! అతని మనస్సు నెఱవేఱే దారి ఏర్పడింది. ఏవిధంగా అంటే – ఒకనాడు సూర్యుడు అస్తమించిన తరువాత పొయ్‌కై యాళ్వార్లు తిరుక్కోవలూర్‌ను చేరి, అక్కడ మృకండుముని ఇంటికి పోయి, వీధిగదిలో శయనించారు. తర్వాత పూదత్తాళ్వార్లుకూడా అచటికే వచ్చి చేరగా, **"వైష్ణవో వైష్ణవం దృష్ట్వా దండవత్ ప్రణమేత్ భువి"** (వైష్ణవుడు ఇంకో వైష్ణవుని చూచి భూమిపై దండప్రణామాన్ని చేయాలి) అనే శాస్త్రవిధిప్రకారం

ఒకరికి వేఱొకరు విధి ప్రకారంగా ఉపచరించిన తరువాత, "ఈచోట ఒకరు పరుండ వచ్చును; ఇద్దఱు కూర్చుండవచ్చును" అని పొయ్‌కై యాళ్వార్లు విన్నవించగా, ఆరీతిలోనే ఇద్దరూ అక్కడ కూర్చుని ఉన్నారు. దాని తరువాత, పేయాళ్వార్లు సైతం ఆ చోటికే వచ్చి చేరగా, ఒకరికి వేఱొకరు దండం సమర్పించి, ఉపచరించిన తర్వాత "ఈచోట ఒకరు పరుండవచ్చును; ఇద్దఱు కూర్చుండవచ్చును; ముగ్గురు నిలిచి ఉండవచ్చును" అని పొయ్‌కై యాళ్వార్లు, పూదత్తాళ్వార్లు ఇద్దరూ చెప్పగా, ఆ రీతిలోనే ముగ్గురు అక్కడే నిలచి ఉండి, పరస్పరం భగవద్గుణాలను చెబుతూ, వింటూ ఆనందిస్తున్నారు.

అపుడు త్రివిక్రమమూర్తి వారివిషయంలో అనుగ్రహించడం కోసం దట్టమైన చీకటిని, గొప్ప వర్షాన్ని కల్గించి,పెద్దరూపంతో వారిమధ్యలోకి వచ్చి నిలచి, సహించడానికి సాధ్యంకానంత గొప్ప సమ్మర్దాన్ని కల్గించాడు. దానికి పిమ్మట వీరు "ఇంతవరకూ లేని సమ్మర్దం ఇపుడు ఏర్పడడానికి ఏం కారణం? ఇతరులెవరైనా ఇక్కడివచ్చి ప్రవేశించారా" అని శంకించగా, పొయ్‌కైయాళ్వార్లు పూమి అనే ప్రమిదలో సముద్రజలాన్నే నేయిగా చేసి, సూర్యుని దీపంగా వెల్గించగా, పూదత్తాళ్వార్లు అన్బు (ప్రేమ) నే ప్రమిదలో ఆర్తినే నేయిగా, చింతనను వత్తిగా చేసి, జ్ఞానదీపాన్ని వెల్గించగా, ఈ రెండిటి వెలుగువల్ల చీకటి పోయినందువల్ల పేయాళ్వార్లు భగవానుని తాము సేవించడాన్ని తెలిపినపుడు, ముగ్గురూ భగవత్స్వరూపాన్ని చక్కగా తెలిసికొని, అనుభవించి, ఆనందమహాప్రవాహాన్ని పొంది, దానికి పరీవాహరూపాలుగా ప్రబంధాలను అనుగ్రహించి, లోకులను ఉజ్జీవింపజేయాలని తలచారు.

అపుడు పొయ్‌కై యాళ్వార్లు **"వైయమ్ తకళియా"** అని ప్రారంభించి, పూదత్తాళ్వార్లు **"అన్బే తకళియా"** అనిప్రారంభించి, పేయాళ్వార్లు **"తిరుక్కణ్డేన్"** అనిప్రారంభించి, ముగ్గురూ మూడు తిరువన్దాది ప్రబంధాలను అనుగ్రహించారు. ఈ ప్రబంధాలు క్రమంగా **ముదల్‌తిరువన్దాది** అని, **ఇరణ్డామ్ తిరువన్దాది** అని, **మూన్ఱామ్ తిరువన్దాది** అనే పేర్లతో వ్యవరింపబడుతున్నవి.

తరువాత, ఈ ఆళ్వార్లు ముగ్గురూ దేహళీశుడనబడే తిరుక్కోవలూర్ ఆయనార్ శ్రీపాదాలను సేవించి, ఆజ్ఞను పొంది చిరకాలం దివ్యక్షేత్రాలను అన్నిటిని చేరి, వాటికి మంగళా శాసనం చేసి, యోగబలంలో వేలాది ఏండ్లు ఈ భూలోకంలో వేంచేసి ఉండి, భూలోకాన్ని ఉజ్జీవింపజేశారు.

**ముదలాళ్వార్ల శ్రీపాదాలే శరణం.**